# మనవి!

'గృహలక్ష్మి' పత్రిక తెలుగు ప్రజా
కానికి చిరపరిచితం. ముఖ్యంగా మహిళా
ోకమునకు గత 25 సంవత్సరములనుండి
ేయుచున్న యితోధిక సేవ మహిళాభ్యుదో
ృద్ధికి బహుముఖంగా నుపకరించిన విష
యము విస్మరించరానిది.

పూజ్యులు డా॥ కే. యన్ కేసరిగారి
ర్యాణం పత్రికా నిర్వహణకు తీరని
ోటైనా మీఅందరి సహకార సద్భావము
తో గృహలక్ష్మి కలకాలం వర్ధిల్లడం
జాహితానికి విశేషంగా తోడ్పడగలదు.
ందుకుగాను తమ అమూల్య రచనలు,
లహాలు, ఆదరాభిమానములు 'గృహ
క్ష్మి'ని మరింత ప్రజోపయుక్తంగా
చేయాలని మా కోరిక.

ఈ సందర్భమున యీ పత్రికకు చందా
దారులుగా చేర్పించే ఉద్యమములో మీరు
ందాదారులుగాచేరి, చందాదారులు
క్కొక్కరు కనీసం నలుగురినైనా చందా
దారులుగా చేర్పించి యీ ఉద్యమాన్ని
లపరచవలసినదిగా మా ప్రార్థన.

సంపాదకుడు



# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక


వ్య వ స్థా ప కు లు

డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య



సంపుటము ౨౩]  ఆగస్టు 1954  [సంచిక ౮

# విషయసూచిక



ముఖచిత్రం : కుమారి అమృతవల్లి




నీళ్లకు వచ్చిన వనిత

చిత్రకారుడు: శ్రీ వై. నాగేశ్వర రావు




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# తిరుపతి విశ్వవిద్యాలయము

ఆంధ్రదేశంలో మరొక విశ్వవిద్యాలయము తిరుపతిలో ఏర్పడింది విద్య, విజ్ఞాన, సంస్కృతులు ప్రజలలో బహుళ వ్యాప్తం కావడానికి యీ విశ్వవిద్యాలయం దోహదం కానుండుట సంతోషింపతగిన విషయము. యావదాంధ్ర ప్రజానీకం ఆంధ్ర దేశంలోని రెండు విశ్వవిద్యాలయములను విశాల దృక్పథంతో తమ అభ్యుదయ పురోభివృద్ధులకు వినియోగపడేలాగున రూపొందించుకోగలరని ఆశిద్దాము.

శ్రీ వేంకటేశ్వర (తిరుపతి) విశ్వవిద్యాలయంలో ప్రాచ్యవిద్యాబోధనకు - సంస్కృతము, శాస్త్రీయ సంగీతము, నాట్యము, లలితకళలకు ప్రాధాన్యమివ్వబడ నుండుట ఒక విశిష్టత.

ఈ నూతన విశ్వవిద్యాలయము రూపొందడంతో తమకు ఆంధ్ర విశ్వవిద్యాలయము అందుబాటులోలేదని మద్రాసు విశ్వవిద్యాలయముతో అనుబంధించబడి యుంటుండిన చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలోని కళాశాలలు, ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు అనుబంధంచేయబడి రెండు సంవత్సరాల అనంతరం

వానితో బాటు నెల్లూరు జిల్లాలోని మూడు కళాశాలలు - మొత్తం 13 కళాశాలలు దాని యాజమాన్యంలోకి రాగలవు.

శ్రీ వేంకటేశ్వర విశ్వకళాపరిషత్తు చిన్నదయినా శిల్ప, సంగీత, నాట్య శాస్త్రాది లలితకళలలాంటి ప్రాచ్య విద్యల బోధనకు ప్రాధాన్యమివ్వ నుద్దేశించినదగుటచే భారత దేశంలోని తక్కిన విశ్వవిద్యాలయాలన్నిటిలో విశిష్టమైన స్థానము నాక్రమించగలదని ఆశిద్దాము. ఈ అవకాశాలను ఆంధ్రప్రజానీకం - ముఖ్యంగా మహిళాలోకం తమలో విజ్ఞాన వికాసాలతో బాటు సంగీతము, నాట్యము, శిల్పములాంటి కళల నభ్యసించి ఆరాధనకు అవకాశములు విస్తృతంకావాలి.

తిరుపతి సుప్రసిద్ధ పుణ్యక్షేత్రము; ప్రాచీన భారతీయ సంస్కృతికి నిలయము. ఇట్టిచోట విశ్వకళాపరిషత్తు నిర్మాణమయి మానవ వికాసానికి విద్య, విజ్ఞానాలతో బాటు విశేషంగా దోహదమివ్వగల లలితకళలు ఆంధ్రజాతికి సర్వతోముఖమైన పురోభి వృద్ధిని సమకూర్చుగాక!

## అస్పృశ్యతా నిర్మూలన
## గృహ పరిశ్రమల అభివృద్ధి

కాలం నడకలో వాయువేగ మనోవేగంగా వస్తున్న పరిణామాలు కులాశ్రమ ధర్మాలకు ఏనాడో స్వస్తి చెప్పినవి. కాని పండ్లు బిగువుతోద్దీ వానికి క్రమబద్ధంగా తాము కట్టుబడి యుండకపోయినా బూటకంగా మాత్రం వానిపేర్లను చెప్పి సంఘంలో కొందరు స్వార్థపరులై వ్యవహరిస్తున్నారు.

కులానికి వృత్తికి సంబంధమున్నదనుకునే కాలం యించుమించుగా గడచి పోయింది. వృత్తినిబట్టి అగ్ర, నీచ కులాలనే విచక్షణకు అవకాశంలేదు. మానవ జీవితములో ప్రతియొక్క వృత్తి ప్రధానమయిందే. ఏదిలోపించినా మానవుని ప్రధాన వసరములకు లోటేర్పడినట్లే. వీనిని గుర్తించినవారు అన్ని వృత్తులను, వాని నవలంబించే మనుష్యులను సమానగౌరవ మర్యాదలతో ఆదరిస్తారు. అది అస్పృశ్యతా నివారణకు తొలిమెట్టు.

కులాలన్నా, మతాలన్నా ఏవగించుకుంటూ ఉపన్యసించినంత మాత్రంచేతనే సమస్య పరిష్కార మగుతుందనుకోడం పొరబాటు. కులాల ప్రాధాన్యము ఎలాగూ నశిస్తున్నది. అయితే ఆర్థికంగా, వైజ్ఞానికంగా వెనుకబడియున్న వర్గాలలో విద్యా సౌకర్యాలకు, జాతీయనిర్మాణంలో సమాన బాధ్యతలకు, హక్కులకు అవకాశములు ఏర్పడిననాడు కులవర్గాలు నశిస్తాయి. అందుకుగాను కులవిచక్షణ లేకుండా పరస్పర సహకార సద్భావములతో ప్రజలు జీవయాత్ర సాగించడానికి అలవాటుపడాలి. ఉన్న అవకాశములను వినియోగించుకుంటూ, కావలసిన అవకాశములను సాధించుకుంటూ తమ జీవితపురోభివృద్ధిని రూపొందించుకోవాలి. అందుకుగాను కులతత్వాలను రెచ్చగొట్టుకోడంగాని, ద్వేషాన్ని ప్రోత్సహించడంగాని ఏమాత్రం అవసరముండదు. జాతీయ పురోభివృద్ధినే లక్ష్యముగాగల ప్రతియొక్క భారతీయుడు విశాల దృక్పథంతో సర్వమానవ సౌభ్రాతృత్వమును దృష్టిలోనుంచుకోవాలి. ఇది అస్పృశ్యతను మొదలంట రూపుమాపేస్తుంది.

మతమనేది మానవునకు వ్యక్తిగతమయింది. దాని ప్రభావం మానవజీవితం మీాద అమోఘమైనది. ఇహపర సౌఖ్యాన్ని ఆశించిన ప్రతిమానవుడు ప్రపంచకల్యాణాన్ని, సర్వప్రజాహితమును కోరి తదనుగుణ్యంగా వ్యవహరించడం పరమార్థమనిపించుకుంటుంది. ఏ మతంయొక్క ముఖ్యధర్మాలకు యిదివిరుద్ధంగా నుండజాలదు. ఏనాడో రూపొందించబడి, యీమతాలలోనైవెనా ధర్మాలు ఆకాలానికి యీ కాలానికిగల విప్లవాత్మకమైన మార్పుల దృష్ట్యా ప్రజలకు హానికరములనితోస్తే వానిని అభ్యుదయమార్గాలలో లోకశ్రేయస్సు కనుగుణ్యంగా రూపొందించుకొని అనుసరించాలి. ఏమతమునైనా ఆచరణలో పెట్టనివారు మతాలనుగురించి విమర్శించడం, కలహాలను, అనైక్యతను ప్రోత్సహించడం ద్రోహమనిపించుకుంటుంది.

బీదరికమును ప్రాతిపదికగా యావత్ ప్రజానీకానికి విద్యాసౌకర్యాలను సమకూర్చడం, జీవనవసతులు కల్పించడం జరిగితే యీనాడు ప్రభుత్వము అస్పృశ్యతా నిర్మూలనకని, గృహపరిశ్రమల అభివృద్ధికని వెచ్చిస్తున్న డబ్బు సార్థక్యము నొందతుంది.

గృహపరిశ్రమల్క అభివృద్ధికి అవకాశాలు చాలావరకు ప్రజలచేతులలో యున్నవి. పరిశ్రమకు అవసరమైన పెట్టుబడిని తాము సేకరించుకోవచ్చును; లేద

ప్రభుత్వ సహాయము నర్థించవచ్చును. కాని అందులో తయారయే వస్తువులకు విక్రయ సౌకర్యాలనుగురించినది పెద్దసమస్య. తమ సామర్థ్యాన్ని, చాకచక్యాన్ని వినియోగించి ఉపయుక్తమయిన, ఆకర్షణీయమైన ప్రజావసరములను గృహపరిశ్రమలు ఉత్పత్తిచేయాలి. గృహపరిశ్రమలు త్పత్తి చేసే వస్తువుల ప్రాధాన్యాన్ని ప్రజలు గుర్తించి తమ అవసరాలకు వానినికొని వినియోగించుకోవాలి. అలా ఉత్పత్తి అయిన వానిని ప్రజలు బహుళవ్యాప్తంగా ఆదరించి వినియోగానికి పూనుకొనిననాడు యీనాటి ఖద్దరూ, చేనేతపరిశ్రమకంటె అభివృద్ధిచెందజాలవు. దేశంలోని భారీయంత్ర పరిశ్రమలు విదేశములతో వాణిజ్యవ్యాపారాలకు, సత్సంబంధాలకు, సత్వర జాతీయ పురోభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు వినియోగపడాలి.

గృహపరిశ్రమల నిర్వహణసయితము సహకారపద్ధతులలో ప్రతిస్త్రీకి, పురుషునకందుబాటులోనికివచ్చి, ఉత్పత్తినాణ్యతను గడించి ప్రజాదరణ పొందిననాడుగాని దేశం సుభిక్షంకావడానికి కొంచైనా అవకాశముండదు.

---

## సంజ వెల్గు

శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి

సంజ వెల్గుల లోన
సన్నిధికి రావోయి
కాంతి పుంజములోన
కలిసి పోదామోయి!
అరుణ బాలవు నీవు
చరణ దాసుడ నేను
సరస కూడుదమోయి
సంజ వెల్గులలోన!

సంజవెల్గుల...

నీటి నీడలలోన
నివసించి పోదాము
ఆకాశ లోతులను
అరసి చూతాము!

సంజవెల్గుల....

ప్రేమ నౌకను జేరి
ప్రియముతో పోదాము
మన ప్రేమలోకాల
మాన్యతను జెందంగ!

సంజవెల్గులలోన....

# శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా శతకము



పండిత వేదం వేంకటకృష్ణశర్మగారు

ఇంతవఱకు "మాతృసేవ"లో నా "శతక వాఙ్మయ" వ్యాసాలు దాదాపు వందవరకూ కావచ్చినవి. కాని, అవన్నీ, కవులనుగూర్చి వారి శతకాలనుగూర్చి మాత్రమే. ఒక్క కవయిత్రినిగూర్చి గాని తద్విరచిత శతకాన్ని గూర్చికాని యింకా తడవక పోవడం ఒక విధంగా లోపమే. అది తొలగించుకోవటానికే, యీ నా ప్రయత్నం. పైగా "శతకవాఙ్మయసర్వస్వ" మనే పేరుతో నా వ్యాసాలన్నీ పుస్తకరూపం పొందుతూవున్నది. ఇప్పటికి 256 పుటలయినవి. మొదటి సంపుటి 500 పుటలకు మించగలదు. అందులో శతకరచయితలయిన కవుల చరిత్రలతోబాటు కవయిత్రుల' జీవితాలనుగూడా కొన్ని చేరిస్తేనేకాని, అది సమగ్రంకాదు. ఆ యీ కారణాలనుబట్టి యీ అనుబంధాన్ని రాయటానికి ఉపక్రమించాను. శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారిచే రచితమై, కీ॥ శే॥ కేసరిగారిచే ప్రచురింపబడ్డ "శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా శతకాన్ని యిందుకు నాందిగా స్వీకరించినాను:—

ఈ శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా శతకాన్ని ఎప్పుడు ముద్రించార్లో తెలియదు. కాని గ్రంథకర్త్రిణి పీఠిక మాత్రము ప్రమాది పుష్యశుక్ల ఏకాదశినాడు వ్రాయబడింది. అది క్రీ. శ. 1939 ఫిబ్రవరిమాసంలో వస్తుంది. కనుక ముద్రణంకూడా ఆ కాలానికి కొంచెం ముందూ వెనకగా ఉంటుంది.

ఈ శతకానికి శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి గారు ఉపోద్ఘాతం వ్రాశారు. కీ॥ శే॥ విమర్శకాగ్రేసర బిరుదాంచితులగు శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు దీనికి పరిష్కర్తలు.

పీఠికలో కవయిత్రిగారు "ఏలకో, నేటివరకెవ్వరును శ్రీ జ్ఞాన ప్రసూనాంబికపై నొక శతకమును జెప్పరైరి" — అని అన్నారు. శ్రీ విష్ణుసర్వ శాస్త్రిగారుకూడ ఆ దేవిపై - శ్రీ కృష్ణవేణమ్మగారి వలెనే మత్తేభ శార్దూల వృత్తాలలో ఒక శతకాన్ని వ్రాసివుండటం బహుశా ఆమె తన శతకం రచించే నాటికి ఎరిగియుండక పోవచ్చు.

ఇక ఈ శతకరచనా ధోరణినిబట్టి చూస్తే-ఇంతటి కవితాప్రౌఢిమ సామాన్యంగా 40 ఏండ్ల ప్రాయమయినా వుంటేనేగాని లభ్యపడదు. పైగా ఇందులో సంస్కృతంపాలు ఎక్కువ. అవలీలగా సమాసాలు సాగిపోతూ వుంటవి. అడ్డమాకలులేని యీ మెగారి కవితావాహిని రసతుందిలమూ, శబ్దమాధుర్యమూ, భావబాహుళ్యమూ కలిగి క్రొంగ్రొత్తపోహణులతో చిందులు త్రొక్కుతూ వుంటుంది - కవిత్వంలోని కిటుకులు క్షుణ్ణంగా మనస్సుకువస్తేగాని - యీలాటి జిగిబిగియల్లిక - అలవడదు. చాలా కృషిచేసి సంతరించిన కవితాపాకమని రెండుమూడు పద్యాలు చదవటంతోటే తెలిసిపోతుంది. అట్టికృషి స్వానుభవంతో ఈమెగారు తెలుగు గొప్పతన మెరిగిన లేతవయస్సు నుంచీ నలభైయేండ్లవరకయినా చేసివుండవలెనని నా వూహ. గనుక ఈమెగారి జననం - ఈ శతాబ్దాదికి ఒకటి రెండేండ్లు అటూ ఇటూ అయివుంటుంది. తన బాల్యాన్ని యీ మహిళారత్నము తిరుపతిలో గడపినట్లు తోస్తుంది. - తత్పీఠికలోని యీ క్రింది వాక్యాలు చూడండి:—

"బాల్యమున వీరి (శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యాగారి) మనుమరాండ్రతో నాడుకొనుచు వారిలో

నొక కీర్తినగ బెరిగియుండుటచేతను, వారిచే 'నాయనుంగుమన్మరా'లని సంబోధింపఁబడుటచేతను, వారు మా కందఱకు గురువులగుటచేతను వారే దీనిని సవరించి యొసంగవలయునని వారి పాదపద్మముల కెఱఁగి విన్నవించుకొంటిని"—

కాని యీయమ జన్మస్థలము తెలియదగిన ఆధారం గ్రంథంలో ఎక్కడా కనబడదు. తలిదండ్రులను మాత్రం శతకంలోని రెండోపద్యంలోను కడపటి గద్యంలోను పేర్కొనింది.

"హరసేవాపరతంత్రుఁడు ద్రవిడవం
శాంభోధిచంద్రుండు, ధీ
వరుఁ, డాత్రేయపవిత్రగోత్రజుఁడు వి
ద్వద్వందితుండేలిచు, నీ
ధరణిన్ రంజిలు రామశర్మ గుణర
త్నాంభోధి లక్ష్మాంబ నీ
కరుణం గాంచిరి నన్నుఁ గృష్ణమను శ్రీ
జ్ఞానప్రసూనాంబికా!"

గద్య - "ఇది శ్రీజ్ఞానప్రసూనాంబికా వరప్రసాద సమాసాదిత కవితావైభవ, శ్రీకట్టారామశర్మార్యతనయ, నితాంతనయ, వాధూలగోత్రపవిత్ర, సుధీజనవిధేయ, గంటికృష్ణవేణీనామధేయ ప్రణీతంబు".-

ఇందువల్ల - ఈ వనితామణి, కోనసీమ ద్రావిడ బ్రాహ్మణశాఖకు చెందిందనిన్ని - శ్రీ కట్టారామశర్మకు లక్ష్మాంబవలన కలిగినదనిన్ని తెలుస్తున్నది. ఈమె అత్తవారింటిగోత్రం వాధూలసగోత్రం. కాని, తన భర్త యెవ్వరో చెప్పకపోవడం ఆంధ్రసతీతిలకాల సహజశీలజనిత మనస్సంకోచమని తోస్తుంది. అయినా- తన భర్తృగౌరవాన్ని పోషించే స్వభావంగలది. అందుచేతే 3 పద్యంలో-"మాన్యున్ ఘనుం బొందిి" అని భర్తను ప్రశంసించింది.

మంచి పాండిత్యం గడించి, శ్రీ నాగపూడివారి పరిశోధనతో నిగ్గుదేరిన యీ యబలాశిరోమణి కవితా ప్రాగల్భ్యం తరిగొండ వేంకమాంబ, ఆతుకూరి మొల్లమాంబల రచనాసౌష్ఠవాని కేమాత్రం తీసిపోయింది కాదు. వారి కృతులతోబాటు, ఈమెగారి యీ శతకంకూడ సారస్వతంలో శాశ్వతస్థానం సంపాదించుకుంది. ఇంతటి ప్రజ్ఞావిశేషంతో చెలువారినా యీ సాధ్వీమణి వినమ్రభావం ఈమె విద్యకు వన్నె తేవటం యెంతయినా మెచ్చతగిన అంశం. పాశ్చాత్య సంపర్కంచేత మన కలవడ్డ దుర్గుణాలలో - నాలుగు ముక్కలు నేర్చినంత మాత్రాన గురుజనులను లక్ష్య పెట్టకపోవడం, సర్వజ్ఞత్వంతో బుఱ్ఱతిరిగిపోవడం, జాతీయతా విధ్వంసకమార్గాలు త్రొక్కడం, ఆర్యధర్మాచారాలకు విరుద్ధములైన వేషాలు వేయడం- ప్రధానంగా మనవారికి పరిపాటి అయిపోయింది. అందులోనూ - ఈ నూత్న ప్రియత్నానికి ఆర్యావర్తం వారికంటే దక్షిణాపథవాసులయిన మనవారు సులభంగా లొంగిపోవడం దేశదౌర్భాగ్యం. అందులోనూ నగరవాసిస్త్రైణం, మరీని దీనికి పురుషుల ప్రోత్సాహమే వుంటే ఇక చెప్పవలసిందేముంది? మళ్ళా మన ఆంధ్రజాతి తన ప్రాచీన సంప్రదాయాలెన్నటికయినా అలవర్చుకొని బాగుపడాలంటే ఆంధ్రవధూటులే ముందంజవేయవలసివుంది. అట్లు వేసిన నాడే తెలుగువారిండ్లు నిత్యకల్యాణం పచ్చతోరణంగా వెలుగారగలదు.

అట్టి భారతీయ పురంధ్రీమతల్లులలో - ఆంధ్రసీమంతినీమణులలో - ఈ శతక కవయిత్రీ సౌభాగ్యవతి చేర్చదగిందని ఆయమ వినమ్రతను తెలిపే యీ క్రింది పద్యాలే చాటుతున్నవి:—

"కావ్యజ్ఞానము లేదు, శాస్త్రహితసం
స్కారంబు శూన్యంబు, త
ర్కవ్యాకృన్నియమంబుసున్న, కల వా
జ్మాధుర్యమట్లయ్యు నే

భవ్యశ్రీ భవదీయ పాదభజన
ప్రాప్తానుదత్తాకృతిన్
కావ్యాలాప వినోదినీ పొగడెదన్
జ్ఞానప్రసూనాంబికా.''

''రసికుల్మెచ్చఁగఁ, బండితుల్పొగడరా,
రా రాజుల్ భళీమేలనన్
పసయౌ కైతలు సెప్పజాల, నిఁక పు
ష్పవ్రాతముంజేరు సూ
త్రసమానంబుగ నాకవిత్వము భవ
త్పాదారవిందాధివా
స సమారాధనఁ బూజ్యతం గనును, శ్రీ
జ్ఞానప్రసూనాంబికా''

ఉత్తమ భారతాంగనా జన్మసిద్ధ స్వభావసముచితమైన కవయిత్రీమణీ సంప్రార్థితవరము ఎంత సమంజసమయిందో పరికించండి:—

''మును నాయిందిర కోడలైన రతియుం
బూతాత సావిత్రియున్,
ఘనమౌ దీర్ఘసుమంగలీత్వమును నీ
కారుణ్యభాగ్యంబునన్
దనియంగల్గిరి, నాకు నట్టి వర మ
త్యంతానుకంపామతిన్
జననీ యిమ్ము నినున్ భజింతు నెపుడున్
జ్ఞానప్రసూనాంబికా''

ప్రాచీనార్యాచార విముఖురాండ్రయిన నేటి సతీరత్నములంగూర్చి యీమె వాపోయిన విధం గమనించండి:—

''అతిథుల్వచ్చిన సత్కరించుటయొ, కా
కభ్యాగతిం జూచుటో,
పతిసంసేవ యొనర్చుటో, సుతులఁ బెం
పస్యేర్చుటో, పెద్దలన్
సతముం బూజయొనర్చుటో, కలరు
యోషారత్నముల్ తొల్లి, యే
కతమో నేఁడవి సేయనెంచరు సతుల్
జ్ఞానప్రసూనాంబికా''

విదేశ విద్యలను ఈ యమ్మలతలమానిక మీసడించిన విధ మెన్నదగినది:—

''అర్వాచీనపథానుషంగులయి, ది
వ్యజ్ఞానసంపన్నతన్
సర్వవ్యాపకమైన యార్యమతమున్
సాహిత్యము న్వీడుచున్
సర్వం బూడ్చి విదేశమందు చదువుల్
సాగించువారేగదా
గర్వాంధుల్ నిజదేశవంచకులు, శ్రీ
జ్ఞానప్రసూనాంబికా''

''పరభాషల్ పఠియించి ప్రౌఢఫణితిన్
భాషింపఁగావచ్చు, నా
పరవేషాదులఁ దాల్చి మానవులు వి
భ్రాంతాత్ములైయున్నచో,
ధరలోనన్ బులిఁజూచి నక్కయును వా
తవ్వెట్టుకొన్నట్టులౌ

ఖరదై తేయ మహోగ్ర గర్వదమనీ!
జ్ఞానప్రసూనాంబికా!"

స్వదేశ ప్రజాస్థితిని, పాలకుల దురత్యయాలను ఈ క్రింది రెండు పద్యాలలో కండ్లకు కట్టినట్లే శతక కారిణి వర్ణించటం మూలాన ఈవిడకుగల దేశాభిమానం వెల్లడి అవుతున్నది:–

"దేశారిష్టముచేత నెల్లప్రజలున్
దీనార్తులై గంజికిన్
లేశంబైనను లేక, గాసిపడుటల్
లెక్కింపకే, భూపతుల్
ఆశాపాశపిశాచబద్ధులయి, తా
మల్లాడుచున్నారు, త
న్నాశం చింత మెఱుంగరైరి జననీ!
జ్ఞానప్రసూనాంబికా!"

"పరగగు శూరుల కాలవాలమగుచున్
ప్రఖ్యాతిగన్నట్టి భా
సురమౌ హైందవదేశ మెన్నిదినముల్
శోకార్తమై దాస్యమే
శరణంచుం బడియుండ జూచెదవికన్
చండాసురధ్వంసినీ!
కరుణాస్వాన్తము దేశదాస్యము వడిన్
జ్ఞానప్రసూనాంబికా!"

ఇందులోనూ కొన్ని అనుకరణాలు కనబడుతున్నాయి:–

1. "తల్లీ! నిన్నుఁ దలంచి పుస్తకము
చేతంబూనితిన్"–

అనే సరస్వతీస్తుతి పద్యాని కనుకరణచ్ఛాయ:-

"తల్లీ, యాశ్రితకల్పవల్లి, నిజభ
క్తామౌఘ విధ్వంసినీ!
ఫుల్లాంభోరుహపత్రనేత్ర, నిను నేఁ
బూజింతు నేవేళ నా
యుల్లంబందు వసించి సల్లలితమా
సూక్తుల్ సుశబ్దాళితో
సల్లాపింపఁగఁ జేయు నీ స్తవనమున్"

2. అరయన్ శంతనుపుత్రుపై విదురుపై
నక్రూరుపై కుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయిన్
నందవ్రజశ్రేణిపైఁ
బరగంగల్గు కృపారసం బిపుడు నా
పైఁ గొంత రానిమ్ము, నీ
చరణాబ్జంబులు నమ్మినాను జగదీ
శా! కృష్ణ! భక్తప్రియా!"

అనే పద్యాని కనుకరణం:–

"అరయం బార్థునిపై, మృకండు
సుతుపై, నజ్ఞారిపై, బాణుపైఁ
గరిపై, శ్రీపయి, భిల్లవంశపతియౌ
కన్నప్పపైఁ గాళుపైఁ
బరగంగల్గు కృపారసం బిపుడు నా
పైఁ జూప నీనాథుతోఁ
గరుణావార్నిధి, తెల్పరాదె, జననీ!
జ్ఞానప్రసూనాంబికా."

(సశేషము)

# సవతి తల్లి

శ్రీ పిళ్లా సుబ్బారావుశాస్త్రి

ఆరోజు దీపావళి. వూరంతా దీపాల కాంతితో కళకళలాడుతోంది. పిల్లలూ పెద్దలూ అంతా బాణాసంచా కాలుస్తున్నారు. ముఖ్యంగా పిల్లలందరూ ఆ రోజు ఎంతో ఉత్సాహంగానున్నారు. గుమ్మాలకు తోరణాలు, రంగుకాగితాలు కట్టుకుంటున్నారు. కొందరు చిత్రవిచిత్రంగా దీపాలను తమయిళ్లపైన, ఇంటిముందూ అమరుస్తున్నారు – పిల్లలంతా క్రొత్తబట్టలు వేసుకున్నారు. కాని రామూ మాత్రం చినిగిపోయినచొక్కా, మాసిన జుట్టూ, వాడిపోయిన ముఖంతో ఓ పెద్ద బిందె బుజాన పెట్టుకుని మోస్తున్నాడు.

రామూ వీథంట నీళ్లబిందె మోసుకు పోతూవుంటే కొంతమంది పిల్లలు రామూని చూసి ఎగతాళిచేస్తున్నారు. మరికొంత మంది వెక్కిరిస్తున్నారు.

"పాపం! పండంటికుర్రాడు... వాళ్ల అమ్మే బ్రతికివుంటే యిలావుండేవాడా!" ఒకామె జాలిగా రెండో ఆవిడతో అంది. ఆమాటలు రామూకు వినిపించగానే కళ్లంట నీళ్లు గిర్రున తిరిగాయి. "నాకు అమ్మ లేదా...!" అనుకున్నాడు – వెనక్కి తిరిగాడు. ఆమాటలు అన్న ఆమె అక్కణ్నే వుంది. గబగబా ఆమెదగ్గరకి వెళ్లాడు.

"అమ్మగారూ! చెప్పండి...! నిజంగా నాకు అమ్మలేదా....?" బిందెని క్రిందకి దించి ఆమెకాళ్లు పట్టుకు అమాయకంగా ప్రశ్నించాడు. ఆమె ముందు చెప్పడానికి తటపటాయించింది. కాని పిల్లవాడు బ్రతిమలాడుతూవుంటే ఆమాతృ హృదయం కరిగిపోయింది. రామూని లేపి కళ్లుతుడుస్తూ చెప్పింది – "లేదునాయనా! నీకు అప్పటికి ఐదేళ్లు వుంటాయి. మీఅమ్మకి కలరా వచ్చింది! .... వూరు అంతా కలరావ్యాధి కమ్మేసింది! ఆ రోజుల్లో మీ అమ్మ చచ్చిపోయింది! ... ఏడవకు...! ఎంత ఏడ్చినా చచ్చినవారు లేచివస్తారా? – తర్వాత మీనాన్నగారు యీ కమలను వివాహం చేసుకున్నారు! కమల నీ సవతి తల్లి..."

రామూ దుఃఖాని దిగమ్రింగుకు యింటికి బయలుదేరాడు. రాత్రి తిండి లేదు...! ప్రొద్దుటమాత్రం ఇన్ని గంజినీళ్లు తాగేడు ..!! 'ఏం! రామూ బీద వాడా...?'–కాదు. బీదవాడుకాదు! సంపన్నుని కొడుకు! కాని తల్లి లేనివాడు.!!

"ఏంరా! ఇంత ఆలస్యం? – అబ్బ! ఆరుగంటలకు వెళ్లాడు...! ఇప్పుడా రావటం...!" కాళికాదేవిలా ప్రత్యక్షమయింది గుమ్మంలో కమల

"లేదమ్మా! పంపు దగ్గర జనం ఎక్కువవున్నారు...!" అన్నాడు రామూ మెట్లెక్కుతూ. "ఏడిచావులే ఏడుపు...!" అందికమల - "ఏమే! పనిమనిషి ఏమయిందీ -" అని అడిగాడు రామూ తండ్రి కమలను.

"మీరు నోరుమూసుకోండి! ... నేనూ చదువుకున్నాను...! నాకు తెలుసు! తిండి తిని కూర్చుంటే పిల్లలకి అజీర్తిచేస్తుంది...!" కమల అనగానే నోరు మూసుకుని చిన్న అమ్మాయితో ఆడుకుంటూ కూర్చున్నాడు.

రామూ మెట్లు ఎక్కుతూ మెట్లమీది నుంచి తూలి పోయాడు క్రిందకి. కమల "ఓరి వెధవా! మా అమ్మగారి బిందెను పొట్టన పెట్టుకున్నావుకదరా...!" అంటూ గబగబా పరుగెత్తి బిందెను తీసుకువచ్చేసింది! రామూను లేపటానికి వెళ్లబోయే భర్తని కూర్చీలోకి ఒక్కతోపుత్రోసి "వాడే లేస్తాడు...!" అంది. భార్య చేతిలో కీలుబొమ్మ అయిపోయిన రంగనాథం నోరుమూసుకు కూర్చున్నాడు!

రామూ దెబ్బలను వూదుకుంటూ వంటయింట్లోకి ప్రవేశించాడు. "ఏం! వచ్చావా!... హుఁ,.. వెళ్లు, మరిరెండు బిందెలు నీళ్లు తగలబెట్టి, గదులన్నీ ఊడ్చి, దీపాలు వెలిగించాలి! ... పో ...!" అని ఆజ్ఞాపించింది.

"అమ్మా! ఆకలేస్తోంది! .... ఇంత కాఫీ యివ్వు...!" అన్నాడు దీనంగారాము.

"కాఫీ.. ? కాఫీ లేదు గీఫీ లేదు . !" అంది తనకూతురుకి పాలుపడుతూ కమల.

రాత్రి బాణాసంచా అంతా కాలుస్తున్నారు. రామూ దీనంగా చూస్తూనుంచున్నాడు. కమల అందరిళ్లపిల్లలకి దీపావళి సామాను పంచిపెడుతూ, తనపిల్లచేత కాలిపిస్తూ.ఆనందంగావుంది.

తొమ్మిదిగంటలు కొట్టారు. రామూ దీపాలప్రమిదలలో నూనె పోస్తున్నాడు. కమల, అమ్మాయిని ఒడిలోకూర్చోపెట్టుకు సామాను కాలుస్తూ 'అమ్మాయ్! నువ్వు కూర్చో . ! నేనుపోయి మిఠాయి తెచ్చియిస్తా'నని వెళ్తుంది. మేడమీదనుంచి క్రిందకు——మేడ అంటుకుంది...! భగభగ మండుతోందిమేడ...!-బైటకు పరిగెత్తారంతా. కాని అమ్మాయి మాత్రం ఏడుస్తోంది!

"పాప వుండిపోయిందండీ...!" అంది కమల గోలపెడ్తూ. ఎవరూ వెళ్లరాయె!- రామూ గబగబా పరిగెత్తాడు మేడపైకి- చెల్లెల్ని యెత్తుకుని కూలిపోతున్న మేడమీదనుండి ఒక్కవూపని గెంతేశాడు...!! అంతే! రామూ పూర్తిగా చితికిపోయాడు! కాని అమ్మాయికి మాత్రం దెబ్బలు తగలలేదు ...!!!

"డాక్టర్...!" అన్నాడు రంగనాథం. "లాభంలేదు...!" అన్నారు అంతా.

"అమ్మా! వస్తున్నా...! పిలిచావు కదూ...!" అని కేకవేసి శాశ్వతంగా కళ్లు మూసుకున్నాడు రామూ!!!

—o—

# అపూర్ణ చిత్రాలు

'హృదయిని'



తూలికాభూషణుడు తన యలవాటు చొప్పున ఆ విశ్రాంత ఏకాంతసీమమయిన యిసుక తిన్నెల చెంతకు చేరాడు. అది సంధ్యాసమయం. చీకట్లు అలుముకోటానికి ఇంకా చాలావ్యవధి ఉంది. దూరాన యూనివర్సిటీ హాస్టలు రేడియో అస్పష్టంగా ఏవో 'హిందూస్థానీ గీతాలు ఆలాపిస్తూంది. భూషణుడికెదురుగా గంభీరముద్రతో తన పురాతన అస్తిత్వాన్ని చూపించుతూన్న ఆ విశాలపర్వతము, దానిపై మసలుతూ ఏవో మంతనాలాడుతున్నట్లున్న హిమధూమం, క్రిందికి దిగివస్తున్న ధేనుసంతతి, గగన తలాన లోకబాంధవుడు వెదజల్లిన అరుణరేఖలతో ఆటలాడుకొంటున్న రంగురంగుల మేఘాలు - భావుక హృదయుడయిన అతన్ని అనిర్వచనీయానందంలో ముంచివేసినయి. అమోఘంగా ఉన్న ఆదృశ్యాన్ని తన 'అల్బం'లో చిత్రించాలని అతని మనసు వేగిర పడింది. మరుక్షణమే ఆల్బంలో ఒకపేజీపై అతని పెన్సిలు తీవ్రగతితో ఉన్మత్తరేఖల్ని గీయసాగింది. కొన్ని నిముషాల్లోనే ఆ హృదయస్పందనమయిన దృశ్యం 'స్కెచ్'గా తయారయింది. కొత్తవాళ్ళ కాబొమ్మ పూర్తి అయినదిగానే తోస్తుంది. కాని అతృప్తితో అతని పెన్సిలు ఇంకా ఆ చిత్రంలో అటుఇటు సంచరిస్తునే ఉంది.

కొంచెము దూరంలో ఒక ఆంగ్లవనిత విహారానికి వచ్చినట్లు. కనుపించింది, భూషణుడు ఒకసారి నలు వైపులా తన దృష్టిని సారించినప్పుడు. కాని అతడు తన బొమ్మను చిత్రించటంలో లీనమయిపోయాడు. ఆ సుందరితోపాటు ఆమె సహచరి ఒక సీమకుక్క_ దారి చూపిస్తూంది.. ఆ మందగామిని భూషణున్ని సమీపించింది.

"మీ ఏకాంతాన్ని భంగం చేస్తున్నందుకు మన్నించాలని కోర్తా!"

భూషణుడు తలపైకెత్తి చూచాడు – ఎదురుగా ఒక అపరిచిత ఆంగ్లసుందరి! అమాయికమయిన వీక్షణాలతో ఉన్న ఆమె వినీలనయనాలు కనుపించినయి. ముందుగా ఆమే పలుకరించటం - అందులో అచ్చమయిన ఆంధ్రంలో! — భూషణున్ని విస్మయావృతుణ్ని చేసినయి. వెంటనే శిష్టాచారంతో— "ఫరవాలేదు. ఇందులో ఏమి భంగముంది!" అని ప్రత్యుత్తరించాడు.

"ఆ చిత్రాన్ని నేను చూడొచ్చా! అల్లంత దూరాన్నించి చూస్తూన్నా – మీరేదో చిత్రాన్ని గీస్తున్నట్లు గమనించా" వినయపూర్వకంగా అడిగిందా ఆంగ్లసుందరి.

సాదరంతో భూషణుడు తన ఆల్బంను ఆమె కరకమలాల్లో నుంచాడు. ఆమె తన విశాలముగ్ధనయనాలను ఆ చిత్రంపై ప్రసరింపజేసింది. సమ్ముఖంలో ఉన్న ఆ ప్రత్యక్ష ప్రకృతి దృశ్యం మనోహరంగా చిత్రితమయి ఉంది; శ్రద్ధ,ఉత్కంఠతతో చూచింది.

ఆమె తన చిత్రాన్ని తదేకధ్యానంతో విలోకిస్తున్నప్పుడు ఆమె సహజసౌందర్యాన్ని భావుక చిత్రకారుడయిన భూషణుడు అవలోకింపకుండా ఉండలేకపోయాడు _ అది నిజమయిన భారతీయ హిందువునకు ఉచితమయింది కాకపోయినా! షేక్స్పియరు, కాళిదాసు మహాకవుల మధురమంజుల కృతుల్లోవచ్చిన విమలమోహన యామినులను స్మృతిపథంకు తెస్తూందామె. దర్పరహితమయిన భారతీయ సాధారణ

నైపథ్యరీతితో ఆ ఆంగ్లశరీర భారతీయ, ఆంగ్ల, సౌందర్యసమ్మేళన మూర్తి భవించినట్లుంది.

"మీరు నిజంగా భారతీయ చిత్రకళాకారుల ప్రతినిధిగా తోస్తుందిచిత్రంవల్ల! "విధేయాన్వితయై పలికిందా పల్లవాధరి.

మధురస్వనమిళితమైన ఆమె ప్రశ్న భూషణుడి తన్మయత్వాని సంచలితం చేసింది. "మీ ప్రశంసకు తగినంత అర్హుణ్ని కాను. నేను ఇంకా చిత్రకళా విద్యార్థినే - ఆచార్యుడినిగాను!" అని వెంటనే ప్రత్యుత్తరించాడు. ఆమె ముగ్ధురాలయింది.

"మీ పరిచయభాగ్యాన్నిస్తారని ఆశిస్తున్నా" సవిధేయంగా అడిగిందామె.

"ఇక్కడ యూనివర్సిటీలో బి. ఏ. (ఆనర్సు) చదువుతున్నా. తూలికాభూషణుడని పిలుస్తుంటూరు నన్ను"

ఆమె స్నేహమయ వీక్షణాలతో భూషణున్ని ఆపాదమస్తకం పరికించింది. తరువాత, ఆమె అల్బం లోని ఒక్కొక్క చిత్రాన్ని చూడసాగింది. సూర్య భగవానుడు తన అంతిమ అరుణారుణ కిరణాలతో ఆ గౌరకన్యయొక్క మృదులసమున్నతకపోలాల్ని ప్రకాశమానం చేస్తున్నాడు. మందపవనాలు మెల్లగా ఆమె ఉంగరాలజుట్టుతో ఆటలాడు కొంటున్నయి. ప్రకృతి విభావరిరాకను కోరుతుంది.

ఆ ఆంగ్లరమణి ఆల్బంలోని సగము చిత్రాలనైనా చూడలేదు, చీకట్లుమెల్లగా దిక్కుల నాక్రమించినయి. ఆమె అల్బంను భూషణుని చేతికిస్తూ - "మీ చిత్ర లేఖనం నన్ను పూర్తిగా ఆకర్షించింది. మీబసఎక్కడ? చీకటి పడుతుంది. నేను మీకు కొంచెం శ్రమ ఇచ్చాను!" అంది.

"ఇందేమి శ్రమ ఉంది? నా బస ఆ కనుపిస్తున్న యూనివర్సిటీ హాస్టలే. ఆఁ. మీ పేరేమిటో తెలిసికో వచ్చునా!" చిఱునగవుతో ఆల్బంను చేతుల్లో త్రిప్పు కుంటూ అడిగాడు భూషణుడు.

"శీలా హైవర్త్. చూడండీ, ఆ కొండకు దగ్గరగా ఉండే బంగళా, అదేమేముండేచోటు, మీ కభ్యం తరం లేకపోతే మీ విశ్రాంతిసమయాల్లో మాయింటికి వస్తారని కోర్తా!" అని నమ్రతాపూర్వకంగా ఆమె పలికింది.

"మీ ఆహ్వానానికి కృతజ్ఞుణ్ని." భూషణుడు మందహాసంతో పలికాడు. ఇద్దరూ మెల్లగా నడువ సాగారు - ఆమె ప్రక్కనే ఆమె కుక్కాను. కొంత దూరంనడిచారు. తనవెంటనే వస్తున్న శీలా హైవర్తును చూచి ప్రయత్నపూర్వకంగా భూషణుడన్నాడు - "మీరు నా వెంటొస్తూ బసను మరచిపోయినట్లుంది!"

ఆమె తనతో నడుస్తున్న కుక్కను తీసికొని హృద యాన చేర్చుకుంటూ, "లేదు. -ఆ చీలిపోయేదోవే మా బంగళాకు పోయేది. మీరు తప్పకుండా మా యింటికి వస్తారుకదూ!" అని అంది.

"ప్రయత్నిస్తా!" భూషణుడన్నాడు.

ఇంతలో ఆమె బాటవచ్చింది. భారతీయవైఖరిలో చేతులు జోడించి "నమస్తే!" అని ఆమె మసక చీకట్లలో తన బసవైపు నడచివెళ్లింది.

♦ ♦ ♦

ప్రతిసాయంత్రమూ తూలికాభూషణుడు ఆ చిర పరిచితమయిన ప్రశాంత - ఏకాంత ప్రదేశానికి వెళు తున్నాడు. అటు శీలా హైవర్త్ కూడ వస్తున్నది. ఆ ఉత్తుంగ సికతాతలమున భూషణుడి దగ్గర కూర్చొని సంధ్యాప్రకృతిని విలోకిస్తూ హృదయపూర్వకంగా మాట్లాడుతుంది. ఆమె తెలుగుమాటలు, చిఱునగవు, విశాల నయనాలు, సరళభావము, అన్నీ అతని హృదయంలో ఒక విధమయిన స్నేహపూరిత భావాల్ని నింపినయి. ఆ యిద్దరి సంభాషణ చాలా వరకు చిత్రలేఖనం గూర్చే ఉండేది. కొన్నాళ్ళ తరు వాత భూషణుడు తెలుసుకొన్నాడు - ఆమెకూడా ఒక చిత్రకారిణిని. మరుసటిరోజే ఆమె యింటికి వెళ్ళాలని అనుకొన్నాడు.

మరుసటిరోజు సాయంత్రం. ఆ ఏకాంతస్థలాన శీలా హైవర్తు భూషణున్ని యథారీతిగా కల్సికొంది. "తూలికాభూషణ్ గారూ! మీరీసాయంత్రం మా యింటికి రాక తప్పదు. ఇందుకు మీరన్యథా ఆలోచింపకుండా అంగీకరిస్తారని నా కోర్కె!"

"నేనీవేళ మీ స్వాగతం లేకపోయినా మీయింటికి రావాలని నిశ్చయించుకొన్నా. అయితే మీరు మాత్రం మీ చిత్రాలను నాకు చూపిస్తారు కదూ!" అని వెంటనే భూషణుడన్నాడు.

ఆమె లేతకెంపు, తేలిక పెదవులపై చిఱునగవు చిందింది. సంతోషభరితురాలయింది. అంగీకార సూచకంగా ఆమె నయనాలేమిటో పలికినయి.

ఇద్దరూ ఆమె బంగళావైపు బయలుదేరారు. విభావరియగుట కింకా విలంబనముంది. ప్రకృతి పక్షుల కలకలారవములతో ఉల్లాసపూరితంగా ఉంది. దూరాన హోస్టలు రేడియోనుంచి ఏదో యుగళగీతము వినపడుతుంది.

బంగళా సమీపించింది; ఒక రమణీయ పుష్పవనం మధ్యలో ఉంది. వికసితపుష్పలతా గుల్మాదులచే ఆ పుష్పవాటిక ఆనందనిలయంగా ఉంది. భూషణుడూ, శీలా ఇద్దరూ గేటుదాటి లోపలవున్న బంగళాపంచలో ప్రవేశించారు. ద్వారముదగ్గర ఒక సేవకుడున్నాడు. వాడు శీలాను చూచి ఆంగ్లేయ పద్ధతిలో నమస్కరించాడు.

"బాబా ఉన్నాడా?" శీలా వాడిని ప్రశ్నించింది.

"ఇంకా రాలేదు మాడమ్!" వాడు వినయంగా జవాబిచ్చాడు.

శీలా భూషణున్ని లోనికి తీసికెళ్ళింది. అది ఒక విశాలము, సుందరము అయిన హాలు. చక్కని రీతిలో కుర్చీలు, మేజాలు తీర్చిఉన్నయి. ఒక మేజాదగ్గఱ యిద్దరూ కూర్చొన్నారు. ఒక పరిచారకుణ్ణిపిలిచి వాడికేదో సంజ్ఞ చేసింది. రెండుమూడు నిముషాల్లో వాడు కాఫీ, బిస్కట్లతో ట్రేను తెచ్చి వాళ్ళిద్దరి ముందున్న టేబిలుపై పెట్టాడు.

శీలా విధేయతతో, స్నేహమయ వీక్షణాలతో ఆ అల్పాహారాన్ని చూపిస్తూ, "తీసుకోండీ!" అన్నది.

"ఎందుకండీ! ఇవి!" భూషణుడు తన స్వాభావిక మందహాసంతో ప్రత్యుత్తరించాడు. కాని శీలా చిఱునగవుతో ట్రేను అతడిదగ్గఱగా ఉంచింది.

కాఫీ సేవనముతరువాత శీలా భూషణున్ని మేడపైకి తీసికెళ్ళింది. అదొక అలంకృతమయినగది. గోడలకు అయిదారు చిత్రాలు తగిలింపఁబడియున్నయి. భూషణుడు ఒకొక్క చిత్రాని సమీపించి పరికింపసాగాడు. అన్నీ శీలా చిత్రించినవే. అందులో రెండు బొమ్మలు భారతీయ చిత్రకళారీతిలో చిత్రితమయిన గొల్లపిల్లలబొమ్మలు. రంగులు ఆకర్షణీయంగా ఉన్నయి. మఱి రెండు కథకళి నాట్యభంగిమల చిత్రాలు. కాని వాటిలో భారతీయ కన్యాసౌందర్యపేశలత కొరవడి ఉంది.

"ఈ రెండుచిత్రాలు చిత్రలేఖనంలో నాకున్న లోటును చూపిస్తున్నయికదూ!" అని శీలా మెల్లగా పలుకరించింది.

"లోటేముంది? మీ దేశానికి భిన్నమయిన మానవరూపచిత్రణం అయినందువల్ల కొంత హంగు తగ్గింది. అంతే!" అన్నాడు భూషణుడు.

మరొకటి ప్రకృతి దృశ్యమున్న చిత్రం. అక్కడ ప్రక్కనున్న కిటికిలోనుంచి కనుపించే దృశ్యమే అది, అని భూషణుడు గ్రహింపగలిగాడు. ఆ దృశ్యం చాల బాగుంది. ఆ చిత్రం దగ్గర నిలువబడి,- "ఈ ప్రశాంతమయిన గదిలో కూర్చుండి ఇటువంటి రమణీయదృశ్యాన్ని తిలకిస్తుంటారన్నమాట!" అని తన సంతోషాన్ని వెలిబుచ్చాడు భూషణుడు.

"మీరు విహారానికివచ్చి కూర్చునే ప్రదేశం కంటేనా!"

"ఎందుకు కాదు!"

"ఉం. నావు మీరు కూర్చునే చోటే చాలా ప్రశాంతంగా ఉంది."

"ఈ అభిప్రాయం నామీద మీకున్న స్నేహాభిమానాలవల్ల కలిగిందని భావిస్తున్నా!"

"ఏమయినా అనుకోనండి!"

తరువాత - అక్కడే ఒక అందమయిన పియానో వాద్యముంది; దానిముందు కూర్చోని, "మీక్కూడ సంగీతం వచ్చునుకుంటా!" అని భూషణుడు ప్రశ్నించాడు.

"అంటే మీక్కూడా సంగీతంలో...!" శీలా తిరిగి చిఱునవ్వుతో పలికింది.

"కొద్దిగా ప్రవేశముంది."

"అయితే ముందు మీరొకపాట వాయించి చూడండి!"

భూషణుడిలో ఉన్న సంగీతలాలస శీలామాటల చేత ఉత్సాహభరితమయింది. పియానోకీళ్ళపై అతడి వ్రేళ్లు అటుయిటూ నడకలు, పరుగులు తీసినయి. ప్రక్కనేనిలబడి శీలా తన్మయత్వంతో ఆట్యూన్ను, ఆలకిస్తూండిపోయింది. ట్యూను పూర్తయింది.

"మార్వెలస్! మెలోడియస్!!" భూషణుడి దగ్గఱగావస్తూ అన్నది శీలా.

ఇంతలో - 'లోపలకు రావచ్చునా?' అన్న మాటలు ద్వారం బయటనుంచి వినబడ్డయి.

"బాబా!" అని శీలా ఆనందాతిశయంతో కొంచెము పెద్దగా పల్కింది. ఆమెద్వారం చెంతకు వెళ్ళి తనతోపాటు ఒక వృద్ధుడ్ని - ప్రశాంత వదనుడిని లోనికి తీసుకొచ్చింది. అతడు ప్రేమతో తనచేత్తో ఆమె నడుమును పట్టుకొని ఉన్నాడు. భూషణుడు వెంటనే లేచి అతడికి అభివాదనం చేశాడు.

"వీర్నే బాబా! నేను నిత్యం సాయంత్రం కలుసుకొని, చిత్రలేఖనాన్నిగూర్చి చర్చించేది, వీరే ఆ తూలికా భూషణులు!" అని శీలా ప్రమోద సంభ్రమాల్తో పల్కింది.

వృద్ధుడి తెల్లని గడ్డముపై ఉన్న పెదవులపై ఒక చిఱునగవు తొణికింది. అతడి నేత్రాలు జ్ఞాన పూరితంగా ఉన్నయి.

"మా నాన్నగారు!" అని శీలా భూషణుడితో అన్నది. వృద్ధుడు సంతోషంతో "తూలికా భూషణులుగారూ! మీరింతకుముందు వాయించిన ట్యూను నన్నెంతో మైమరపించింది సుమా!" అని ముక్తసరిగా పలికాడు. అతడిమాటల పొందిక అతడి విశాలహృదయాన్ని వ్యక్తం చేస్తున్నయి.

కృతజ్ఞతా విస్మయాలతో భూషణడన్నాడు. 'మీరింతవరకు బయటుండినాట్యూను వింటున్నారన్న మాట!'

అవునన్నట్లా వృద్ధుడు నవ్వాడు.

"మా భారతదేశ సంగీతం, చిత్రకళలపై మీకూ, శీలాకు ఇంత ప్రేమాభిమానాలున్నందుకు నేనేమి చెప్పకోవాలో తోచటంలేదు!" అన్నాడు భూషణుడు వినమ్రంగా.

"సంగీతం, చిత్రకళలనే అంటున్నారు మీరు-మీ తెలుగు భాషా సంబంధమయిన పరిశోధన కూడా చేస్తున్నారు మా బాబా!" అని శీలా అభిమాన పురస్సరంగా పల్కింది.

"బ్రౌనుదొరగారిని గుర్తుకు తెస్తున్న మీకు నా అభివందనాలు!" అని ఆ వృద్ధుడికి తన ఆనందాన్ని తెలుపుకొన్నాడు భూషణుడు.

◆ ◆ ◆

కాలదేవత తన వయసును పెంచుకుంటూంది. విరామం లేకుండా పగళ్లు - రాత్రుళ్లు గడచిపోతున్నయి. తూలికాభూషణుడికి శీలా, బాబాలనుంచి యెంతో ఆదరాభిమానాలు లభించినయి. వారి బంగళాకిప్పుడతడు నిరభ్యంతరంగా పోయివస్తూన్నాడు. ఒకప్పుడు శీలాతో సంగీత చిత్రలేఖనాలని గూర్చిన

సంభాషణ. మరొకప్పుడు బాబాతో భాషావిషయికమయిన చలోక్తులు. తానెరిగిన చిత్రలేఖనారీతుల్ని శీలాకు నేర్పుతుండేవాడు. వారిద్దరి మిత్రత్వాన్ని చూసి బాబా ఎంతో మురిసిపోతుండేవాడు. శీలాను భూషణుడి సుగుణములు, చిత్రలేఖన సంగీతకళా కౌశలమూ పూర్తిగా కైవశం చేసికొన్నయి. ఆమె నిజంగా భూషణుడు కనుపించని రోజున విహ్వలి అయిపోయేది. పాఠకులు, కథకులు ఊహించేరీతిలోనే శీలాకు భూషణుడితో ఉన్న స్నేహము గాఢప్రేమగా మారింది. భూషణుడు కళాదృష్టితో శీలాను - ఆమె సౌందర్యాన్ని ప్రేమించాడు. ఆమె సౌందర్యాన్ని తన చిత్రాల్లో ప్రతిఫలింపచేశాడు. ఆ యిద్దరిమధ్య స్నేహబంధము - కళాపిపాస కల్మషరహితమై పోయింది. శీలాలోని నిర్మల స్వభావము భూషణుడి చిత్రకళను సజీవంగా చేసింది; ఆమె ప్రతిరూపాల నెన్నిటినో చిత్రించాడు. చిత్రకళయం దిప్పుడతడు పరిపూర్ణ కుశలుడు.

భూషణుని ఆనర్సుపరీక్షలు పూర్తిఅయినయి. ఇంటికి రమ్మని- తండ్రిగారి దగ్గరినుంచి ఆదేశం వచ్చింది. ఒక వారం రోజుల్లో తిరిగి వస్తానని శీలాతో చెప్పి - సెలవుతీసికొని తన గ్రామానికి బయలుదేరాడు. శీలా మనసులో ఎంతో ఖేదపడింది. సగము చనిపోయినట్లయింది. బరువెక్కిన హృదయంతో భూషణున్ని రైలెక్కించి తన బంగళా చేరిననాడు, బంగళా అంతా శూన్యంగా తోచింది. భూషణుడు కూర్చున్న కుర్చీలు - వాయించుతుండే పియానో - చిత్రించిన చిత్రాలు - అన్నీ చూచుకొని ఆమె దీనమయిపోయింది. తానెందుకు భూషణునికై యింత పరితపిస్తుందో - తన పరితాపానికి ఫలము దక్కుతుందో లేదో ఆమె కేమీ తోచలేదు. ఆమె యిప్పుడు విహ్వలమూర్తి!

భూషణుని తండ్రి కేశవబాబు తన పుత్రుడు బి. ఏ. (ఆనర్సు) పూర్తిచేసి వస్తాడని, ముందుగానే అతని పెండ్లికి ఏర్పాట్లన్నీ పూర్తిచేసి ఉంచాడు. ఒక లక్షాధికారిని వియ్యంకునిగా వరించాడు. అతని కుమారీరత్నమునిచ్చి భూషణుని పెండ్లి నిశ్చయించుకొని సిద్ధముగా ఉన్నాడు. ఇంటికివచ్చిన భూషణునితో ఆసమయాన పెండ్లిచర్చ తెచ్చి ఆ మహోత్సవం వారంరోజుల్లో జరగాలని తెలియచేశాడు. మొదటినుంచి తండ్రిమాటల్లోనే నడిచే భూషణుడు అందుకు అంగీకరించాడు. పాపము! శీలా తన నెంత ప్రేమించింది! తనకోసం - తన చిత్రకళోన్నతికోసం ఎంత కాంక్షింస్తుండేది! తానిక్కడికివచ్చిన తర్వాత శీలా అక్కడెట్లుందో ఊహింపలేకపోయాడు!!

భూషణుని వివాహవార్త తంతిద్వారా శీలాకు చేరింది. ఎన్నిరకాల వార్తలు ఈ తంతి ప్రసారం చేస్తుంది! శీలా జీవిత పుష్పవాటికలో భీకరప్రళయ ప్రభంజనాలు వెదజల్లినదా తంతి! ఒకటి - రెండు రోజుల్లో భూషణుడు తిరిగివస్తాడని యెదురుతెన్నెలు చూస్తున్న శీలా ఆ పిడుగువంటి వార్తవిని యేమయిపోయిందో - ఆమెలా ఒక కళాకారునికి తన సర్వ కాంక్షల్ని అర్పించుకొన్న యేలతాంగి అయినా సరిగా ఊహించుకోగలదు! భూషణుడు తన్ను బాగా అర్థం చేసుకొన్నాడని ఊహించింది. ఇంత హఠాత్తుగా అతనికి పెండ్లి కాబోతుందని ఊహింపలేక పోయింది. తా నాంగ్లయువతి; అతడు భారతీయుడు. తమిద్దరి కలయికకీదేశంలో చోటులేదా! ఆలోచనలతో ఆమెకు పిచ్చెత్తిపోయింది.



భూషణుని వివాహం అతివైభవంగా జరిగిపోయింది. వివాహ మహోత్సవానికి శీలావచ్చింది. భూషణుడెంతో బాగుందని మురిసిపోయే పియానో వాద్యాన్ని పెండ్లినాడతనికి బహూకరించింది. ఆవిలువైన వస్తువును ఆ సౌందర్యఖనియయిన శీలా సమర్పించటం - ఆమెతో భూషణుడు చనువుగా మాట్లాడటం నిష్కల్మష హృదయులయిన వారిద్దరి చిఱునగవులు- పెండ్లికివచ్చిన పెద్దలనూ, బంధువులనూ ఆశ్చర్యంతో నింపేసినవి. మీదుమిక్కిలి భూషణుడు వేసిన చిత్రాల్లో శీలా ప్రతి రూపాలుండటం వారికింకా

విస్మయం కలిగించినయి. పెండ్లికుమారుడయిన భూషణునను, శీలాను సన్నిహిత సంపర్కమేమయినా ఉండి తీరుతుందని వారిలో కొందరనుమానపీడుతులయ్యారు. ముఖ్యంగా భూషణుని నవవధువు - హేమను ఆ అనుమాన పెనుభూతం తనవశంచేసికొంది. ప్రత్యక్షంగా ఆమె తన భర్త - భూషణుడు శీలాతో చిఱునగవుల్తో సంభాషించటం చూచింది. ఆమె అబోధితహృదయంలో శంకాబీజాలు నాటుకుపోయి మొలకలెత్తినయి. రాత్రింబవళ్లామె ఆలోచనాపరంపరలతో వికలచిత్త అయిపోయింది. ఇంతకుముందే యింకొకరికి తనప్రేమను పంచియిచ్చిన ఒక యువకుని కిచ్చి తన జీవితాన్ని ఖేదపూరితం చేసారని ఆమె లేతమనసు దురభిప్రాయపడింది. శీలా ప్రేమనే అర్థం చేసికోలేకపోయిన భూషణుడు ఇప్పుడు హేమ ఆవేదను మాత్రం తెలిసికోగలడా! హిమ లజ్జాకులిత అని భావించాడు.

కొన్ని నెలలు గడచిపోయినయి ...

భూషణు డెప్పుడూ ఏవో క్రొత్తచిత్రాలను ఊహిస్తూ - చిత్రిస్తూ తనగదిలో - కల్పనా జగత్తులో లీనమయి ఉంటుంటాడు. నిజంగా యీ ప్రపంచంలో అతని ప్రేమను పూర్తిగా పొందగలిగింది ఒక్కటే. అదే - చిత్రలేఖనం! చిత్రలేఖనంమీద అతనికున్న వ్యామోహాన్ని హేమలో అసూయను రేకెత్తించింది! పరమాత్మా! విభిన్నప్రకృతులున్న పురుషునికి, స్త్రీకి దాంపత్యమెట్లా కూరుస్తావయ్యా!

ఇంతేకాకుండా, భూషణుడు అప్పుడప్పుడు విశాఖపట్టణం వెళ్ళి శీలా బంగళాలో కొన్నిరోజులపాటుండి చిత్రలేఖనము గావిస్తున్నాడు. అతనిలో పూర్వంవలెనే శీలాపై ప్రేమాభిమానాలు నిలచి ఉన్నయి. అతని దృష్టిలో శీలాయిప్పుడూ చిత్రలేఖన కళలో సహాధ్యాయినే! అతని ఆ అమాయిక హృదయాన్ని చూచి ప్రేమపరితప్తహృదయిని అయిన శీలా తనలో చిఱునగవు నవ్వుకొనేది. ఇప్పుడుకూడా కొన్నిరోజుల తరబడి తనదగ్గరే ఉండే భూషణునితో యిల్లాగనేది.

"మీ హేమనువదలి యిట్లా పరస్త్రీలదగ్గఱ నాల్గురోజులెలా ఉండగలుగుతున్నారండీ మీరు?"

"పరస్త్రీలనగా!" అని భూషణుడు మందహాసంతో ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నకు సమాధానమేమియ్యాలో శీలాకు తోచలేదు ...

"నేను పరస్త్రీనేకదా!" అంది శీలా.

"అని నేనెప్పుడు భావిస్తానో అప్పుడిక భూషణుడు ఇక్కడకురాడు!" అని పల్కిన భూషణుని నయనాల్లోకి చూసింది శీలా. ఇక మాటాడలేకపోయింది. కొన్ని నిముషాలు నిశ్శబ్దము.

"మీ హేమను ఒకసారిక్కడకు తీసుకురారూ?"

"తప్పకుండా!"

... నిజంగా ఒకనాడు భూషణుడు హేమతో విశాఖపట్టణంవెళ్ళి శీలాభవనంలో దిగాడు. శీలా యెంతో ప్రమోదమొందింది. హేమను తనసహోదరిగా ఎంచి తన సహజ సరళ స్వభావంతో సాదరంతో సంభావించింది. హేమకు శీలా భవనము - ఉపవనమూ - ఆ ప్రకృతీ - తన్ను వెక్కిరించినట్లుగా కనుపించినయి. అక్కడకూడా భూషణుడు చిత్రించిన శీలా చిత్రాలు - ఆమెలో గూడుకట్టుకొన్న శంకకు ఇంకా పోషకమయింది. హిమ మస్తిక మున్మత్తమయింది.

తాను భూషణున్ని మొట్టమొదట కల్సికొన్న చోటు, ఆపై ఇద్దరూ విహరించిన ప్రాకృతిక ప్రదేశాల్ని - అన్నీ హేమకు చూపించింది శీలా. ఇంత చనవుగా తిరిగిన ఆ శీలా తనభర్తతో దాంపత్యం చేయకుండా ఉందా! అని తన స్వాభావికమయిన వెఱ్ఱి ఊహాలతో అపోహాలోనే ఉండిపోయింది. హేమ కళారాధకుల్ని - కళాపిపాసుల్ని అర్థంచేసికోలేని వెఱ్ఱిది!

వేసవి తన భీషణస్వభావాన్ని రోజురోజుకు పెంచుతూన్న రోజులవి. తూలికాభూషణుడు ఒకప్పుడు కాశ్మీరు వెళ్ళాలని అనుకొన్న తలంపును యిప్పుడు కార్యరూపంలో పెట్టాలని అనుకొన్నాడు. అక్కడి రమణీయమైన దృశ్యాలను అక్కడే ఉండి చిత్రించాలనే కాంక్ష అతడిని పురికొలిపింది. శీలా కూడా యిదే కోర్కెతో ఉన్నసంగతి అతనికి తెలుసు. వెంటనే ఆమెకొక లేఖవ్రాశాడు - కాశ్మీరు వెళ్ళడానికి సిద్ధంగా ఉండమని.

హేమ తాను కాశ్మీరురావటం అనవసరమని, తన కారోగ్యంకూడా సరిగాలేదని చెప్పి భూషణుడితో కాశ్మీరుకు ప్రయాణంకాలేదు... భూషణుడు విశాఖ పట్టణమువచ్చి శీలాతో కాశ్మీరుకు బయల్దేరాడు. తన 'రీసర్చి' పనిలో తొందరగా ఉన్న బాబా వారిద్దర్నీ '' 'క్షేమంగా తిరిగిరండి' - అని దీవించి పంపాడు.

కాశ్మీరులో, శీలా భూషణులు ఒక హోటల్లో దిగారు. సింధూనదీతీరానే ఉన్న శ్రీనగరు ప్రాకృతిక మనోమోహన దృశ్యాల కాలవాలమయింది. వేసవి ఆ నగరంలో ప్రవేశింపలేక బేలయయి పోతూంది కదా! శీలా భూషణులు నిత్యమూ ఉదయమూ, సాయంత్రమూ చిత్రాలు చిత్రించుకోటానికి బహిర్ప్రదేశాలకు బయల్దేరేవారు. ఆ నదుల్లో తీర్చిఉన్న పడవల్లో ఎక్కి విహరించారు. మనసుకు వచ్చిన చోట్లలో ఆగి చిత్రాలను గీసుకొంటున్నారు.

వేసవికాలాన్ని అక్కడ వెళ్లబుచ్చటానికి ఎంత మందివస్తారు! హాయిగా ఒక నెలరోజులు గడచి పోయినయి. పుత్రికా ప్రేమ బాబాను శ్రీనగరుకు లాక్కొచ్చింది. ఆ నాటి సాయంత్రం-భూషణుడి జీవితాకాశాన్ని చీకట్లతో వ్యాపింపచేయబోయే సాయంత్రం - బాబా శీలా భూషణులు హిమఘన శకలాల్తో నిండిఉన్న ఆ ఉత్తుంగ శైలాన్ని ఎక్కుతున్నారు. అక్కడక్కడ చిఱుసెలయేరులు జల జల ప్రవహిస్తున్నయి. మంచుబండలు కొన్ని కరుగుతున్నయి.

"భూషణ్ గారూ! మీలాంటి స్నేహితుల్ని పొందటం నా జీవితంలో ఒక భాగ్యంగా తలుస్తున్నాను" అని శీలా అంది.

"నేనూ నాబొమ్మలకు తగిన మీలాంటివారిని ఎక్కడ సంపాదించుకోగలుగుతాను!" ప్రఫుల్ల వదనంతో భూషణుడు పలికాడు. బాబా వారిద్దరి మాటలువిని చిఱునవ్వు నవ్వుకున్నాడు. శీతల సమీ గాలు తమపని సాగిస్తున్నయి. హైమశైలఖండాలు తమ నిర్మల స్ఫటికాకృతికి గర్విస్తున్నట్లుంది.

"శీలా! ఈ ప్రదేశం చాలా బావుంది. నా ఆల్బంలో చిత్రించుతా ఉండు. ఆ పెట్టెలోఉన్న రెడ్ పెన్సిలు ఇటివ్వు" అని భూషణు డక్కడ ఆగి అన్నాడు.

భూషణుడు అక్కడి ప్రకృతి దృశ్యాన్ని చిత్రింప సాగాడు. శీలా నాల్గడుగుల్లో - ప్రక్కనేఉన్న శిఖరాన్ని చూడడానికి నడిచింది. బాబా ఆ ఘనీభూత హిమశిలలను చూస్తూన్నాడు.

హఠాత్తుగా ఒక భయానకమయిన కేక - "బాబా!" అని ఆ ప్రదేశాన్ని ప్రతిధ్వనితం చేసింది. శీలా నడిచినవైపు చూశారు బాబా భూషణులు త్రుళ్ళిపడి. శీలా కనుపించలేదక్కడ! కొట్టుకునే గుండెలతో అటు పరుగెత్తారు. అది శిఖరపు అంచు - ఆగిపోయినయి వాళ్ళ అడుగులు - ముందు అగాధమయినలోయ. ఆ లోయలో ఏదో

పడ్డట్టు పెద్ద చప్పుడయింది. శీలా నుంచున్న మంచు బండ అక్కడలేదు. క్రింద ఉద్వేగంగా ప్రవహిస్తున్న అగాధ హైమప్రవాహంలోంచి తుషార బిందువులు వెదజల్లబడుతున్నాయి.

బాబా భూషణులు ఉన్మత్తుల్లా శీలా ! శీలా ! అని అరచారు. శీలా !! శీ...లా !!! అని ఆ నిర్జీవ పాషాణ ప్రపంచం ప్రతిధ్వనించింది. బాబా ఆర్ద్రనయనాలనుండి సంతతధారగా అశ్రుబిందువులు జారినయి. భూషణుడి తేజోనయనాల్లో శోక తమస్సులు క్రమ్మినాయి.

♦ ♦ ♦

భూషణుడు ఇప్పుడు జీవన్మృతుడు. అతడికి జగత్తు విపన్మయం. ఎప్పుడూ తనలో కలవరిస్తుంటాడు. శీలా వేసిన బొమ్మలు చూచుకొని వెఱ్ఱి నవ్వులు నవ్వుకుంటాడు. అతనికా బొమ్మల్లో శీలా సజీవంతో ఉండి పలుకరిస్తుంది. కాశ్మీరులో ఆమె తాను పూర్తిగా వేయని బొమ్మలు అలాగే అపూర్ణ చిత్రాలుగా ఉండిపోయినయి. లోకానికతడు ఉన్మత్తుడు. నామమాత్రానికి సతి అయిన హేమకు ఆ కళాకారుడు - ఆ నిర్భాగ్య చిత్రకారుడు ప్రేమ విహీనుడు !! అతని పిచ్చి శీలాకై పిచ్చి అంటుంది !

---

# ప్రణయ పరీక్ష

శ్రీ సాధన వీరస్వామినాయుడు



### 1-వ రంగము

స్థలము:-స్థూలకేశాశ్రమము

ప్రవేశము:-ప్రమద్వర ఆశ్రమోద్యానమున సఖులతో పువ్వులు గోయుచు నీక్రింది పాటపాడుచుండును.

పాట

సుందరవనము చూడవె చెలియా!
నందనవని యానందము చిందే ॥సుం॥
నవ్వులు నవ్వే పువ్వులు ఇవిగో!
నాట్యము జేసే పువ్వులు అవిగో!
గండు తుమ్మెద ఝుంకారముతో
బొండు మల్లెల భోగము చూడు ॥సుం॥
రండురండు! ఇవె పారిజాతములు!
సన్నజాజులు! పొన్న పూవులు!
అన్నులు మిన్నులు ఆ గేదంగులు
నాన్నగారి పూజల కొఱకు ॥సుం॥

ప్రమ:-చెలులారా! నాన్న పూజకు ఈ ఆశ్రమములోని పువ్వులే ప్రతిదినము నాకిష్టములేదు. అదో ఎదుట బొండు మల్లెల నికుంజము. చూచారా! ఆ వైపే సెలయేటి ఒడ్డున ఆర విచ్చి యిక్కడకు గుబాళించే గేదంగి పూ చెండుల వాసన! (అని ముందుకుపోవును)

మొదటిచెలి:-ఔనేసఖీ! ఎంత వాసన! ఎంత వాసన! ఆగేదంగులు మనల బిలుచుచున్నవే.

రెండవచెలి:-అవును. మనము నిత్యము నీళ్లు పోసి పెంచే యీ యాశ్రమములోని పుష్పలతలకన్నా ఆ అడవిలో స్వేచ్ఛగాపెరిగే లతాపుష్పగుచ్ఛములే సౌందర్యరాశులై మనోహరముగనున్నవి.

మూడవచెలి:-అమ్మా ప్రమద్వరా! విన్నావా యీ సెలయేటిగానము. మన చెలిని ఒక్కసారి తన వద్దకు రమ్మని పిల్చుచున్నట్లున్నదే!

ప్రమ-:నన్నేనా? మిమ్మలనా?

అందఱు చెలులు:-(నవ్వుచు) ఆహ్వానము పెద్దవారికి. వాని ఆనందములో భాగము అనుచరులది. నీ నీడలము. మాకేమి తక్కువ?

ప్ర-:బలేగడుసరులేమీరు!

చెలులు:-అంతా అమ్మగారి చెలిమి చలువే (ముందుకు కొంత దూరము సాగుదురు)

ప్ర:-(ముందువలె పాటపాడుచు ఆశ్రమ ప్రాంతారణ్యమున బొండు మల్లెల గోయుచు)

పాట

పూవు పూవున సోలి సోలి
పూదేనియనంతా గ్రోలి గ్రోలి
మెల్ల మెల్లన వీచే - వీచే
చల్లని గాలి హాయి హాయి ! (॥సుందర॥
ముందు పాటవలె)

ప్ర:-చూచారా ఆణిముత్యాలవంటి మొగ్గలు! ఆరవిచ్చిన పూలు. అబ్బా! యీ కోనంతా గుండు మల్లెల ఘుమ ఘుమలే! మానాన్నకు వీనితో ప్రత్యేకమైన హారము గుచ్చుతానే.

మొ॥చె:-యీ బంగారు గేదంగి రేకులతో మా ప్రియసఖి నీలవేణిపై నిగ్గులు కులికేటట్లలంకరిస్తాను (మొగలి చెండ్లను గ్రహించి రేకులు చీల్తురు)

రెం॥చె:-(మొగలి పుప్పొడిని ప్రమద్వరపై చల్లుచు) మాప్రాణ సఖి పెండ్లికివే నాకానుకలు; కదుముపొడి. అప్పుడు దొరకునో - దొరకవో - యీ పూలు.

ప్రమ:-(సిగ్గుతో తలవంచి డగ్గుత్తికతో) చాలులే మీ చలోక్తులు. ఎప్పుడూ మీకివే ఆటలు. నాన్నగారి పూజా సమయము దగ్గఱ పడు వేళగుచున్నది. పోదామా?

చెలు:-కావలసిన కుసుమాలు సేకరించాము. ఆ సెలయేటి మాట మఱచాం. ఒక్కసారి దాని దగ్గఱకు పోయి పాలనుఱుగుతో అర్ఘ్యమందించి మరిపోదాము. (అందఱూ నదివైపు నడతురు)

[రురుడు సహాధ్యాయునితో ప్రవేశము]

రురు:-మిత్రమా! వసంతకాలం ప్రభావము చూచావా? యౌవనముతో కాలులు క్రమ్మి యీ యరణ్యమంతా మిసమిసలాడుతుంది.

సహా:-అవును సఖా! సహజతారుణ్యావస్థలోనున్న మీకంటేనా?

రురు:-(కోపముతో) ఏమన్నావ్?

సహా: ఏమన్నాను?నిజమాడితే నిష్ఠురమా?

రురు:-సరే (ముందుకు నడచి) అదిగో! ఆ నల్లని గండశిలలపై నాట్యముజేసే నదీజలాలు చూచావా?

సహా:-ఆఁ చూచా! చూడడానికేగదా వచ్చినది. (ప్రక్కకు తిరిగి ఆశ్చర్యముతో) ఇటు చూడు. అబ్బో! ఒకటి... రెండు...మూడూ... ఆఁ ఆఁ. నావల్లకాదు. ఎంతమంది అప్సరసలు! అబ్బో వారందఱి మధ్యలో రంభ! మీ నాయన మొన్న చెప్పారే మీ అమ్మ ఘృతాచి విషయము. అది జ్ఞప్తికి వస్తున్నది.

రురు:-ఏమిటోయ్! వెఱ్ఱిమాటలు! పగటికలలు కంటున్నావా? నీతో ఎప్పుడూ ఇదే గొడవ. పుస్తకాలల్లో వ్రాతలన్నీ నిజమని నమ్ముతావ్. ఆ నమ్మకములో ప్రతిదానిని భ్రాంతితో చూస్తావు.

సహా:-నా ఖండెముతో ఒట్టు నిజం. అదిగో మొగలి చెట్ల మాటున శృంగార దేవతులు - వనదేవతలేమో!

రురు:-సరే నీవిక్కడుండు. నేను వారు దేవతలో-పిశాచాలో, చూచివస్తాను భయపడి కాలికి బుద్ధి చెప్పకు. త్వరలో వస్తా (అని ప్రమద్వర వెనుకవైపున నామె తారుణ్యాలావణ్యములకు ముగ్ధుడగుచు; నక్కుచు నడక గమనించి పోవును.)

[ప్రమద్వర సమస్థలమున నది గట్టున కూర్చుండును. చెలులు ప్రక్కనుందురు. నురుగులతో జల శీకరములపై జల్లుకొనుచు - బిగ్గఱగ నవ్వుచుందురు.]

చెలి:-అయ్యో! అయ్యో! ప్రమద్వరా! నదిలో పడితివా. (చేతులు విదలించుకొనుచు దీనాక్రాంతములతో) అమ్మయ్యో! ఇంకెట్లా? ఆశ్రమానికెట్లు పోగలమే? మహర్షులు స్థూలకేశుల కేమని చెప్పగలము? ఒక్కగాను ఒక్క ముద్దుల కుమార్తె దుర్మరణము ఏమని చెప్పుట! ఈ ఘోర వార్తను దాచుటెట్లు? చెప్పుటెట్లు?

రురు:-(ఆక్షణమే నదీప్రవాహమున దుమికి ప్రమద్వరను నొడ్డున జేర్చి) భయపడకండి. ఇదిగో మీ చెలికత్తె. ఆమెకేమి అపాయము లేదు. తడి గుడ్డలు పిండండి. కొంచెము తేరుకొననిండు.

చెలి:-మహానుభావా! మా చెలికత్తె పాలిట దేవదేవుడవు. నీ యీ ఋణము మేమెన్నటికి మఱువము. మా వెంట వచ్చి మా సఖ యాతిథ్యమునుగ్రహించి యామెను ధన్యనుగావించుడి. మీరొనర్చిన ఘనకార్యమునకు ఈమె తండ్రి మిమ్ములను నెత్తిన బెట్టుకో గలడు.

ప్రమ:-(కొంచెము తెప్పర్లి కడగంటిచూపుల రురుని చూచి - సిగ్గుతో) తప్పక మా వెంటరావలెను. నా ప్రాణప్రదాతవు. నాకోర్కె మన్నించి యాశ్రమానికి విచ్చేయ వేడుకొంటున్నాను.

(అందఱు నిష్క్రమింతురు)

2-వ రంగము

స్థలము: ఆశ్రమోద్యానము.
ప్రవేశము: చెలులు - ప్రమద్వర.

మొద॥చెలి:- అమ్మా! శ్రావణ పౌర్ణమి ఇక ఐదురోజులే! అటువెనుక యీ పొగడ; మొల్లల కెవ్వరు నీళ్లుపోస్తారే?

ప్రమ:-(నును సిగ్గుతో కోపముతో) ఉండవే - నీదొకే సంబరము.

మొ॥చె:-ఔనమ్మా! మాకు సంబరమే. నీకు మరీ సంబరమే. కాని యిన్నాళ్లు మనతో కలిసి మెలసి ఆటలు పాటలతో ఆనందించినయీ వనమంతా శోకంతో నిండుతుంది. చూడు-అప్పుడే చెట్లన్నీ పూతపూయుటకూడా లేదు.

ప్ర:-ఎందుకుశోకం! ఇట్లా చెడ్డమాటలాడకండి. మానాన్న నాయెడబాటునకు ఓర్చేటట్లు మీరీ ఉద్యానమును కిలకిల మంటు ప్రోది చెయ్యండి. ఈ ఆశ్రమములో ప్రతి మొక్కంటే స్థూలకేశ మహర్షులకు ప్రాణం వంటిది.

చెలు:-ఔను. నిన్ను రురుకుమారుల చేతిలో పెట్టడానికి తాతపాదులు, స్థూలకేశులు అహరహము ఒకే దీక్షతో నున్నారు. ఎంత పెంచిన తండ్రియైన పెండ్లి దినము సమీపించేకొద్ది చింతా భరముతో క్రుంగుతున్నాడే.

ప్ర:-అవును. మానాయన విశ్వావసుడట! తల్లి మేనకట! ఎవ్వరో నాకు తెలియదు. నాకు తల్లి, దండ్రి, గురువు, దైవము మానాన్నే. ఆయనను నేనేలాగు విడువగలను? (ఇంతలో ప్రక్కపొదరింటినుండి పాముకటి పాదమున కాటువేయును. బాధ - నిట్టూర్పులతో ప్రమద్వర.) అబ్బా! ఏమో కఱచినదే. అదో సర్పము. అయ్యో! ఎట్లే - పరుగెత్తి మానాన్నకు చెప్పండి.

(కొందఱు చెలులు పరుగెత్తుదురు. కొందఱామెకు విసురుచుందురు)

చెలులు:-(దుఃఖముతో) నేడెంత చెడ్డదినమే. ఎట్లే! చెలిప్రాలి పోవుచున్నదే! (ప్రమద్వర స్పృహతప్పి క్రిందపడి-చేసైగలు చేయుచు కాళ్లు తన్నుకొనుచు కన్నులు మూయును.)

[ప్రవేశము: గౌతము, కణ్వ, భరద్వాజాది ఋషులు, స్థూలకేశులు, ప్రమతి, రురులు ఆశ్రమ వాసులు]

స్థూలకేశులు:-(శోకముతో) బిడ్డా! నా జీవితజ్యోతీ! ఆరిపోతివా? ప్రమద్వరా! నీకింతతోనే నూఱేండ్లు నిండెనా? కన్నులలో పెంచుకొన్న కుమారీ రత్నమా! నాకన్ను లేపోయినవి. ఇక నాకీ ఆశ్రమమేల? కరాళకాల సర్పమా! నా బంగారు తల్లి నీకేమి యపచారమొనర్చినది! నా ముద్దులమ్మ పెండ్లికెన్నియెన్ని సన్నాహములు గావించితిని! నా ఆశాగిరిలో అగ్నిజ్వాలవైతివా నాగూ? మీ పాప జాతి బుద్ధియింతే.

ప్ర:-ఆర్యా! మంత్రముల వేయించుచున్నాము. మందుల పోయుచున్నాము. కొంచెము చిత్తమున నూరట చెందుడు.

మనమందరము రురు ప్రమద్వర పవిత్ర ప్రణయమున కానందించితిమి. వారి వివాహసందర్శనమునకు కుతూహలపడితిమి. మన బిడ్డలు చిలుకగోరువంకల వలెనుండ మనము ధన్యులమని యాశించితిమి. ఆ ఆశలన్ని అడియాశలైనవి. అయ్యో!......

రురుడు:-(పరుగెత్తి - వగర్చుచు - కన్నీటి ధారలతో పెద్దపెట్టున నేడ్చుచు) ప్రమద్వారా! లేలెమ్మా. ఇదిగో నీప్రాణప్రియుడు-రురుడువచ్చినాడు. ఏదీ నీ సుందర దరహాసము? ఒక్కసారి ప్రియుని చూడవా? నను పలుకరింపవా? ఆ నాడు' సెలయేటి నీట రక్షించినప్పుడు ప్రాణప్రదాతా! అని అమృత మొలకించితివే. పున్నమ నాటితో మనమొకటని దినములు క్షణములుగా గడపితినే. ఒంటరిగా నిప్పుడెళ్లేగితివి? ఏదో ఒక్కతూరి మాట్లాడవా? (అనిశవమును కదలించి గుండె బాదుకొనుచు) అయ్యో! నా ప్రణయదేవత లేదు. నన్నొంటరిజేసి స్వర్గమేగినదా! లోకాలోకములు - సూర్యచంద్ర మండలములు - ఎక్కడకు పోయిననుసరే. నేవదలను. నిన్ను తప్పక నీ తండ్రి కొప్పగింపగలను. చూడు-నీవులేని యీ ఋష్యాశ్రమము నీసఖులు ఎంత దుఃఖ సముద్రమున దోగులాడుదురు? త్రికరణశుద్ధిగ నేనెవ్వరికి ఏ బాధ చేయలేదు. సత్యము పాసించినాను. దేవయజన వ్రతములు దృఢదీక్షతో చేసితిని. ఓ దేవతలారా! నిక్కముగా నేతపస్వినైనచో నాప్రాణమునకు ప్రాణమైన యీ ప్రమద్వర పునర్జీవించుగాక! కాకోల విషము అమృతమగుగాక! (జనమును తిలకించి) భూలోకమున దేవతల వంటి ఋషిసత్తములారా! ఊరకగుంపుచేరి చేతులు నులుముకొనుచున్నారే! ఇదియే నా యిప్పటి మీకర్తవ్యము? మీరెవ్వరైనా విషహరము జేసి ప్రమద్వరను బ్రతికించిన అట్టివారికిదే నా సర్వతపోఫలమిత్తును......

(అవనికలో— ఆకాశభాషితము)

"వత్సా! ఋషికుమారా! కాలవశమైన దానిని ఎవ్వరికి తీర్చవీలులేదు. ఎందుకీ తాపసుల నిందించెదవు? నేనొక్కటి చెప్పెదను. చేయగలవేని-విను.

రురు:-(ఆశ్చర్యముతో నాకసము వైపు చూచుచు) నన్నుద్ధరింప వచ్చిన దేవ దేవా! ఆశగొల్పుచున్నావు. ఆనతిమ్ము ప్రాణప్రియప్రాణాల కోసము ఏమి చెప్పినను చేయగలను!

దేవ:-సరే! నీ ఆయుస్సులో సగమిత్తువా?

రురు:-సగమా! అంతయు నియ్యమన్న

నిత్తును. ఇదే ధారాదత్తము జేతును.
(ఋషులమధ్య తిలోదకముతో దత్తము చేయును)

ప్రమ-:(కనులు తెఱచి నిద్రనుండి మేల్కొన్నట్లు లేచును) చెలులారా! మానాన్న యేడీ? ఇందరి గుంపేల? (రురునిచూచి సిగ్గున)

ఋషులు:-ఇది రురు ప్రమద్వరల ప్రేమ పరీక్ష. పవిత్రమైన ప్రణయ పరీక్షలో విజయము మీదే. బిడ్డలారా! లెండు. ఆశ్రమమునకు పోదము.



## తెలిసికోతగినవి!

ఇండియాలోని 17 కోట్ల 60 లక్షల ఓటరులలోను స్త్రీల సంఖ్య షుమారు 7½ కోట్లు.

◆ ◆ ◆

పంచవర్ష ప్రణాళిక మొదటిరెండు సంవత్సరాలలోను స్మాలు సేవింగ్స్ క్రింద వసూలైన మొత్తము 103 కోట్ల రూపాయలు.

◆ ◆ ◆

ఇండియాలో 1952 - 53లో పండించబడిన కాయధాన్యాలు గత సంవత్సరము కంటె 50 లక్షల టన్నులు ఎక్కువ.

◆ ◆ ◆

ఇండియాలో 34 గ్రామ సేవకుల శిక్షణ కేంద్రాలున్నవి.

◆ ◆ ◆

1952 - 53 సం. ఇండియాలో 74206000 యకరాలలో వరిసాగు చేయబడింది. 1953 - 54సం.లో 76646000 యకరాలలో సాగుచేయబడింది.

◆ ◆ ◆

ఇండియాలోని 197 జీడిపప్పుఫ్యాక్టరీలలో పనిచేస్తున్న 55000 మంది కార్మికులలో నూటికి 78 మంది స్త్రీలు.

(భారత ప్రభుత్వ సమాచారశాఖ)

# అక్క చెల్లెండ్రు

శ్రీమతి చివుకుల లక్ష్మీ పున్నయ్య



వాళ్ళిద్దరి తల్లులు యించుమించు ఒకటి రెండు సంవత్సరాల తేడాల్లో చనిపోయారు. సీతను ప్రసవించి పురిట్లోనే బాలింత జబ్బువలన చనిపోయింది ఆమె తల్లి. అప్పటికి రాధ వయసు 6 ఏండ్లుంటుంది. పురిట్లో పిల్లను రాధతల్లిసాకి తన బిడ్డతో బాటు అల్లారుముద్దుగా పెంచింది. తర్వాత ఆమెకూడ రెండు సంవత్సరాలకు చనిపోయింది. అప్పటినుండి రాధ తండ్రి రాధను, సీతను పెంచి పెద్దచేసి విద్య చెప్పించడము మొదలు పెట్టాడు.

రాధ, సీత పెత్తల్లి, పినతల్లి బిడ్డలు. ఒక తల్లి బిడ్డలు కాకపోయినా యిద్దరు అంతకంటే అన్యోన్యంగా నుంటుండేవారు. రాధ యం. బి. బి. యస్. చదివి ప్రైవేటు ప్రాక్టీసు పెట్టేసరికి సీత బి. ఏ. చదువుతున్నది. రాధ తన అవసరాలకంటేకూడ తన చెల్లెలికి ఏకొరత లేకుండా ప్రేమానురాగాలతో చూచేది.

రాధ మంచి తెలివితేటలుకలది. పరోపకారి. మంచి చెడ్డలను గుర్తించి తన వృత్తిలో చిత్తశుద్ధితో మానవసేవకు ప్రాధాన్యమిస్తూ విశేషముగా ప్రజాదరణకు పాత్రమైంది. దాని ననుసరించి రాబడి, పలుకుబడి బాగా అభివృద్ధి గాంచసాగినవి.

రాధ, మోహన్‌లు చిరకాల మిత్రులు. వాళ్ళిద్దరు డాక్టర్లు. వారిద్దరికి వివాహం ఏనాడో జరుగవలసినది. కాని తాను వివాహితయయిన తరువాత సీత పురోభివృద్ధిపట్ల ఆసక్తికి భంగము కలుగుతుందేమోననే శంకతో తాను వివాహంచేసికోడంలో కాలహరణం జరుగుతుండేది. సీత చదువు పూర్తయి ఆమె జీవితాన్ని ఏకొరతలేకుండా తీర్చిదిద్ది కాని తాను వివాహమాడకూడదని నిశ్చయించుకున్నది.

బి. ఏ. పరీక్షలయినవి. వేసవి శలవులలో రాధతో బాటు సీత వచ్చియుంటున్నది. పరీక్ష బాగా వ్రాసింది కాబట్టి బి. ఏ. అయిన తరువాత చెల్లెలు ఏమి చెయ్యాలని యున్నదో తెలిసికోదలచింది రాధ.

సాయంకాల సమయం. రాధ, మోహన్, సీత పార్కులోకి వెళ్ళి కూర్చున్నారు. రేడియో సంగీతం కొందరికి తన్మయత్వాన్ని, 'మరికొందరికి ఉల్లాసాన్ని కలిగిస్తున్నది. ఇంతలో నొక పదమూడుఏండ్ల కుర్రాడొకడువచ్చి "బాబూ! కానీ డబ్బివ్వండి" అడిగాడు. సీత చీదరించుకుంటూ "ఈ వయస్సులోనే వీడికీ కుష్టురోగం ఎలా ప్రాప్తించిందో - ఎక్కడచూచిన వీళ్లగుంపులే యీ దరిద్రపు పట్టణంలో - జర్మనీలో హిట్లరులాగ వీళ్లనందరిని మొత్తంగా పట్టుకొనివెళ్లి కాల్పించి చంపేస్తే బాగుండు" అన్నది.

"అలా అనగూడదు సీతా! వ్యాధిగ్రస్తులు ఒకవైపు బాధపడుతుంటే మనం వారిని కసిరి కించపరచకూడదు. చేయకలిగిన సహాయంచేసి వ్యాధి నివారణకు, నిర్మూలనకు తోడ్పడాలి" అంటూ పర్సులో నుండి పావలాతీసి కుర్రాడికిచ్చి పంపేసింది.

"రాధా! సీత బి. ఏ. ప్యాసవుతుందికదా - మరి తర్వాత యింకా చదువుతుందా"...అన్నాడు

మోహన్.

సీత సిగ్గుతో తలవంచుకుంది.

రాధ "ఏమోమరి-యింతవరకు ఏమి చెప్పలేదు - ఏం సీతా! నీ యభిప్రాయమేమిటి" అన్నది.

సీత మాట్లాడలేదు.

"పోనీ మన యింటి ప్రక్కని జడ్జీగారి అబ్బాయిని తెలుసుగా - మంచివాడు. పెద్ద ఉద్యోగి. నెలకు వెయ్యిరూపాయలు జీతం. అతడికి నిన్నిచ్చి పెళ్లి చేయాలనియున్నది నాకు" అన్నది రాధ.

"నేను అతనిని చేసికోను" అన్నది సీత.

"మరెవ్వరిని చేసికుంటావో చెప్పు" అంది రాధ. సీత ముఖము వికసించింది. దృష్టి మోహన్ వైపుకు మళ్ళింది. ఆ వాలకంచూచి సీత మోహన్‌ను ప్రేమిస్తున్నట్లు గుర్తించకలిగింది. కాని చిరకాలంగా తనకూ, మోహన్‌కు మధ్య వర్ధిల్లుతున్న ప్రేమ ఏమి కావాలి? తాను ఒకవేళ చెల్లెలుకొరకని మనసు మార్చుకున్నా మోహన్ సీతను వివాహమాడతాడా? కాని యింతవరకు సీత పురోభివృద్ధికి తోడ్పడి ఆమె కట్టి త్యాగాన్నైనా చేయ నుద్దేశించిన తాను సీత, మోహన్‌లకు వివాహం చేసితీరాలనే నిర్ణయానికి వచ్చింది. రాధ హృదయం బాగా బరువెక్కింది. జరుగవలసిన కార్యక్రమాన్ని గురించిన ఆలోచనా తరంగాలతో లేచినిలబడింది. సీత, మోహన్‌లు ఏమి మాట్లాడకుండా ఆమె ననుసరించి నివాసాలకు బయలుదేరారు.

రాధలో అప్పటినుండి గొప్ప మార్పు వచ్చింది. మోహన్‌తో పరిచయము పరిమితంచేసికున్నది. దాన్నిచూచి 'రాధలో వచ్చినమార్పుకు కారణ మేమిటో'యని ఆందోళనపడసాగాడు మోహన్.

♦ ♦ ♦

"రాధా! నీలో ఏదో హటాత్తుగా గొప్ప మార్పు వచ్చినట్లు కనుపిస్తున్నది - అభ్యంతరము లేక పోతే ..." అన్నాడు మోహన్.

"క్షమించండి! - అభ్యంతరము ఏమిలేదు - మనము కావలెననుకున్నదంతా యీ లోకంలో లభ్యమయినచో మనం మానవమాత్రుల మెలాగవుతాము? యిక మన యిద్దరిమధ్య వర్ధిల్లాల్సినది సోదరీ సోదరుల మధ్యనుండే ప్రేమ" అన్నది తలవంచుకొని రాధ.

"ఏమిటి రాధా! - నీవు మాట్లాడేదేమిటో అర్థంకావడంలేదు" అన్నాడు ఆశ్చర్యంతో.

"అవును ఉన్నట్లుండి ఏర్పడిన యీ పరిణామం అర్థంకావడం అంత సులభంకాదు - మా సీతకొరకు నేను చేస్తున్న త్యాగము నాలో యీ మార్పుకు కారణము. సీత మిమ్ములను మనసార ప్రేమించింది. ఆమె అయితే ఒకటి, నేనైతే ఒకటి కాదునాకు; ఆమె సుఖ ఆనందములే నావి. ఆమెను మీరు పెళ్లిచేసుకోవాలి" అంది రాధ.

"అసంభవము - నా ఆత్మను నీకేనాడో అర్పితం చేశాను. దానిలో మరొకరికి స్థానమివ్వడం సాధ్యము కానిపని" అన్నాడు అశ్రుపూరిత నేత్రాలతో.

"నాకు తెలుసు మోహన్! - కాని మీకు నా మీదగల ప్రేమ చిహ్నంగా నా చెల్లెలిని వివాహం చేసికొని తీరాలి. దానివలన సీత సౌభాగ్యానికి గాను నేను చేస్తున్న త్యాగానికి మీరు దోహదం చేసినవారగుతారు - సీత చదువుకున్నది - రూపు రేఖల్లో నాకు ఏమాత్రం తీసిపోదు - మరి యింతకంటే నేను కోరవలసిందేమి లేదు" అన్నది.

మోహన్ అయోమయావస్థలో పడ్డాడు. "మరి నీవో" అన్నాడు.

"నేనా - మీరిద్దరు సుఖంగా జీవయాత్ర సాగిస్తుంటే చూచి ఆనందిస్తూ యావజ్జీవ పర్యంతం బ్రహ్మచారిణిగా నుంటాను" అన్నది సగర్వంగా.

మోహన్ పసిపిల్లవాడిలాగ వెక్కి వెక్కి ఏడ్చాడు. రాధ అతనిచేతులు పట్టుకొని "నన్ను

గురించి యీ మాత్రము త్యాగముచేయరూ !" అంటూ అతని కండ్లలోకి చూచింది.

పొంగిపొరలే దుఃఖముతో చింతనిప్పులాగున్న కండ్లు "నీ కొరకుగాను యీ త్యాగం చేస్తున్నాను" అన్నట్లుగా క్రమంగా చిన్నబోయినవి.



సీత, మోహన్‌లకు రాధ ప్రేమ పూర్వకమైనఆశీస్సులతోటి వైభవంగా వివాహం జరిగింది. తనకు బ్రహ్మచారిణిగా తన చెల్లెలు, మోహన్‌ల ప్రేమ, విశ్వాసాలకు ఏనాడు కొరతయుండదని ఆశించింది.

◆ ◆ ◆

మోహన్‌కు బెంగుళూరులో ఉద్యోగమయింది. సీతను కూడ తీసికొనివెళ్ళి కాపురంపెట్టి కులాసాగా యుంటున్నారు. నెలలు, సంవత్సరాలు గడచి పోతున్నవి. మోహన్ అయినా ఎప్పుడైనా జాబు వ్రాసేవాడు కాని సీత మాత్రం వ్రాసేది కాదు.

రాధ ప్రాక్టీసు బాగా అభివృద్ధి చెందింది. బీద, సాద అనే విచక్షణతో ప్రజాదరణతోబాటు పుష్కలంగా డబ్బు సంపాదించింది. స్వంతంగా యిల్లు కట్టించుకోవాలని స్థలంకొని కట్టుబడి ప్రారంభించిన కొద్దికాలానికే బ్యాంకి దివాలాతీసి ఆమెవి 70 వేల రూపాయలు మునిగిపోయినవి. ఆమెకు ఏమిచెయ్యడానికి తోచలేదు. సగంలో కట్టుబడి నిలబడిపోయిన యిల్లు పూర్తికావడానికి 20 వేల రూపాయలు కావాలి. ఆయిల్లు ఏనాటికైనా తన చెల్లెలికేకదా. వాళ్ళనే అడిగి డబ్బుతెచ్చి యింటి కట్టుబడి పూర్తిచేయడం మంచిదని ఉద్దేశించి రెండుమూడు జాబులు వ్రాసింది. దానికి జబాబైనాలేదు. తనే స్వయంగా పోదలచి తాను వస్తున్నాననీ, కారు పంపవలసినదిగా జాబువ్రాసి బెంగుళూరుకు బయలుదేరి వెళ్ళింది.

రైలుదిగి స్టేషనుకు మోహన్‌గాని, సీతగాని ఎవరైనా వచ్చారేమోనని నలువైపులా చూచింది. ఎవరూ కనుపించలేదు. బండీచేసికొని యింటికి వెళ్లింది.

సీత, మోహన్‌ల అన్యోన్య సుఖజీవితాన్ని చూచి ఆనందపరవశురాలయింది. మోహన్ రాధతో సరదాగా పలుకరించి మాట్లాడాడు; కాని సీత మాత్రం - ఏదో ఒక విధంగా - మనసిచ్చి మాట్లాడకపోవడం రాధకు బాధ కలిగించింది. మోహన్ బ్యాంకి దివాలాతీసి రాధ నష్టపడినందుకు విశేషంగా వాపోయాడు. రాధ ప్రస్తాపనచేయకుండానే కావలసినడబ్బు యివ్వడానికి సిదపడ్డాడు.



"మొత్తము ఒకేసారి వద్దులే మోహన్! మొదట పదివేలుయిస్తే, చాలకపోతే మిగతా పదివేలు పంపుదువుగాని" అంది రాధ.

"అలాగే రాధా! ... " అని మోహన్ అంటూండగా సీత అడ్డువచ్చి "ఇప్పుడు మా దగ్గర పైకం ఏమి దొరకదు అక్కా! ఉంటే నీవు అడుగకముందే యిచ్చేవారము" అంది గుక్క త్రిప్పకుండా.

రాధ హృదయం పగిలిపోయింది. "బ్యాంకి దివాలా తీసింది కాబట్టి మిమ్మల నీనాడు అడుగవలసి వచ్చింది - లేకుంటే అడిగేదాన్ని కాదు" అని కోపంగా లేచి బయలుదేరింది. ఆమె బయలుదేరి వెళ్లుతుంటే సీత మాట వరుసకైనా ఉండమనలేదు. మోహన్ సీత ప్రవర్తనకు విచారంతో అక్కడుండలేక ఎక్కడికో వెళ్ళిపోయాడు.

రాధ చేతిలో నొక చిన్న పెట్టెమాత్రమున్నది. గతాన్ని తలచుకుంటూ ముందుకు నడుస్తున్నది. తాను తన చెల్లెలి సౌభాగ్యానికి చేసినకృషి, త్యాగాలు, యీ నాటి పరిస్థితులు ఆమె ముఖ చిహ్నెలలో విషాద, ఆనందఛాయలను మారి మారి ప్రస్ఫుటింప జేస్తున్నవి.

ఆ మార్గంలో ఏఒకరో యిద్దరో వస్తూ పోతున్నారుకాని యించుమించుగా నిర్మానుష్యమనే చెప్పాలి. ఒక కాలువ వంతెన దగ్గరకు వచ్చింది. కాలువకు నీటినివదలి రెండుమూడు రోజులే అయినట్లున్నది. నీళ్లు తటాకించి పారుతున్నవి. ఉదయం 11 గంటల సమయం. సూర్యకిరణాల తీక్ష్ణత క్రమంగా ప్రబలుతున్నది. వంతెన గోడమీద కూర్చొని -

"నా శ్రేయస్సును వదలుకొని నాచెల్లెలి పురోభివృద్ధికి యింతవరకు అఖండ త్యాగాలు చేశాను. దాని ఫలితంగా ఆమె, భర్తతో సుఖంగా ఏకొరత లేకుండా కాపురం చేస్తున్నది. అంతకంటే నాకిక చూచి ఆనందించవలసినది యీ లోకంలో ఏమున్నది? నేను జీవించియుండి మాత్రము నేను సాధించవలసినదీ ఏమియు లేదు. ఈ నాడు కాకపోయినా ఒకనాటికి నాచెల్లెలు తన యీనాటి ప్రవర్తనకు పశ్చాత్తాపపడి కృతజ్ఞతా పూర్వకమైన ప్రేమ విశ్వాసాలను వెలిబుచ్చ కలదు. మోహన్! సీతను నీ చేతుల్లో యుంచాను - మీరు సుఖంగా, ఆనందంగా నుండటమే నాకు మనశ్శాంతిని కలి

గిస్తుంది. శలవ్ చెల్లీ! మోహన్" అంటూ కాలు టుంది రాధ.
వలో దూకింది. శరవేగంగా పారుతున్న కాలువ తర్వాత సీత, మోహన్‌లకు ఆ విషయం తెలిసి
నీళ్లలో లీనమయి శాశ్వత సుఖాన్ని పొందియుం యుండాలి.

---

ఇంట్లోనుండి "రామూ! తమ్ముడెందుకు ఏడుస్తున్నాడు! — వాడేదడిగితే అది యియ్యమని చెప్పాను కదా నీకు"

"అది కాదమ్మా! నేనిచ్చట ఒక గుంటత్రవ్వాను. దానిని యింట్లోకి తెమ్మంటున్నాడు"

♦ ♦ ♦

టాక్సీలో ప్రయాణము చేస్తున్న యువతీయువకులలో యువకుడు "కారును రోడ్డుమధ్యన అఘాటుగా నిలుపడంలో నీ యుద్దేశమేమిటి" అన్నాడు డ్రైవరుతో వెనుకనుండి.

"అమ్మగారి 'యిక ఆపండి' అన్నమాట విని ఆగాను" అన్నాడు డ్రైవరు.

"పోనియ్యి — ఆమె నీతోకాదు మాట్లాడుతుండినది"

'నారపీచు'

# శ్రావణ శోభ

'స్వప్న'

వేవేగ రండమ్మ వెలదులార యనుచు
నడివడివచ్చు నొక వాలుగంటి
వలపలచేతను వాయనంబుల బట్టి
నేగును వేరొక నీరజాక్షి
వామకరంబున జారిన వలువను
సరిజేయు నొండొక సన్నుతాంగి
బాలుల చంకను బెట్టి ముద్దాడుచు
మెల్లనవచ్చు నొక మంగళాంగి
శ్రావణ మధుమాస మంగళవారంబు
లందు గిలకలనగవులతోడ తెలుఁగు
కిన్నెరకన్నెలు పుష్పసౌరభల వెదజ
ల్లుచును పోదురు పురవాడలందు.
కలికి కొలంకులకాటుక లాకశం
బున గారు మబ్బులై గ్రమ్ముకొనగ
మానిని మేలిమి మేనిమై తొడవుల
తళుకు మెరపు తీవలై మెరయగ
అంగన అందెలరవములురుములుగా
గగనంబునంతట గర్జిల్లంగ
చంచలాక్షి చిలిపి చిరునవ్వె చిటపట
చినుకులై చిటచిటని కురియంగ
లక్ష్మియై శోభిల్లు యువిదలపదములను
దీర్చు పారాణి కరిగి కెందామరలుగ
నలరగ శ్రావణంపుసొబగును జూడ
నిన్నిరూపుల లచ్చివచ్చె ననగదోచె.
మాసంబులలో శ్రావణ మాసంబుననే శుభప్రదంబై లక్ష్మి
వాసంబై నోముల నోచు సువాసినులతో
తెలుంగుసీమ వెలుంగున్.






## భీమపాకం

అరసోలెడు బియ్యం నీళ్లలో నానబోయాలి. రెండు కొబ్బరికాయల తురుమును, నాని వడబోసిన బియ్యమును రోటనుంచి నీళ్లు చల్లుతూ మెత్తగా రుబ్బవలెను. అలా రుబ్బిన దానిని సన్నని తెల్లగుడ్డలో నుంచి గట్టిగా కళాయి గిన్నెలోకి పాలు పిండవలెను. అదే విధంగా అయిదారుసార్లు పిండినపాలను, మెత్తగా కొట్టి యుంచుకొనిన అరవీశ బెల్లమునుకలిపి వడియగట్టి బాణలిలోపోసి పొయ్యిమీదనుంచి కాచవలెను. అది క్రమంగా గట్టిపడునప్పుడు అందులో యాలకులపొడి, దొరికినచో కొద్దిగా పచ్చకర్పూరము, కుంకుమపువ్వు వేసి బాగా కలుపవలెను. దానిని గట్టిపడకముందే నెయ్యి రాచియుంచిన పళ్లెములో క్రుమ్మరించి ముక్కలు ముక్కలుగా కోసి తినినచో చాల రుచిగా నుండును.

## కొబ్బరిలౌజు

అరవీశ బెల్లము మెత్తగాకొట్టి కొంచెము నీళ్లుపోసి పొయ్యిమీదనుంచి ఉడుకునప్పుడు దానిలో రెండు కొబ్బరికాయల తురుమువేసి కలుపవలెను. అవి రెండు కలిసి బాగా ఉడికినప్పుడు కొద్దిగా ఏలకుల పొడిచల్లి కొద్దిగా పల్చగా నున్నపుడేదించి నెయ్యిరాసిన పీటమీదపోసి చదరముగానెరపి కోరిన ఆకారంలో బిళ్లలుగాకోసి నిల్వయుంచుకొని తినుబండారముగా నుపయోగించుకొనవచ్చును.

కుమారి సూర్యదేవర రాజ్యలక్ష్మి

## చామదుంపల వేపుడు

పదిపలముల చామదుంపల పైతోలుతీసి చిన్న చిన్న ముక్కలుగా తరిగి నీటిలో కడుగుము. పొయ్యిమీది బాణట్లో డాల్డాగాని, కొబ్బరి నూనెగాని నాలుగయిదు స్పూనులువేసి కాగనిచ్చి అందులో చామదుంపల ముక్కలు, మెత్తగా నూరిన ఉప్పు, మిరపపొడి పరిమితంగాచల్లి దోరవర్ణముగ, పెళుసుగా అయ్యేదాక వేయించుము. వడ్డనకుముందు కొద్దిగా నిమ్మపండురసము పిండుము.

తాడిగడప అనసూయాదేవి

—o—

# ప్రకృతి సౌందర్యము నడుమ

## సౌందర్యవతులు

ముద్రింపబడిన, రంగు, సిల్కు -

**ఖటావ్ వాయిల్**

ధరించినవారు స్వదేశీ వస్త్రములనే కొనుడు
మంచిరకమునే కొనుడు



ఖటావ్ మకంజీ స్పిన్నింగ్ అండ్ వీవింగు కంపెనీ, లిమిటెడ్, మిల్లులు - బైకుల్లా, బొంబాయి, ఆఫీసు లక్ష్మీ బిల్డింగు, బాలార్డ్ పియర్, బొంబాయి-1

చిల్లర బట్టల దుకాణము : మూల్జీ జెఠామార్కెట్ బొంబాయి 2  చిల్లర బట్టల దుకాణము : 213 నేతాజీ సుభాష్‌చంద్ర బోస్ రోడ్డు, మదరాసు.

SITA'S-KN (j)-192 Telugu

# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## కాంభోజరాజుకథ (క్రీ. పూ. అయిదవ శతాబ్దం)

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

### అతిలోక కల్పన ; అతిశయోక్తులు

ఈ కథలో అతిలోక (Supernatural) కల్పన అధికంగా ఉంది. కాంభోజరాజు తనను గురించి దేవతలు 'గొడ్డుమోతురాజు' అని చెప్పుకొంటూన్న మాటలను విన్నాడు. చెరబండిరాజును దేవతలు కైలాసానికి తీసుకుపోయి పన్నెండేళ్ల పాటు పెంచేరు. ఆ పన్నెండేళ్లు తల్లికి బిడ్డను గురించి స్మృతి ఉండదు. కీలుగుర్రమెక్కి చెరబండిరాజు ఆకాశంలో తిరిగేడు. వీరభద్రదేవుడు ఆ రాజుకే బంగారు పాదాలు, సంహారకలపు దుడ్డును ఇచ్చేడు. యోజనగంధి చెరబండిరాజును చంపడానికి బయలుదేరగా వీరభద్రదేవుడెదురై, చెరబండిరాజు ఆమె భర్త అనిచెప్పి వారిద్దరికి వివాహం చేసేడు.

ఈ కథలో అనేక అతిశయోక్తులున్నాయి. కాంభోజరాజు వీపుమీద వానచినుకుపడి ఘోరమైన వ్రణమయింది. కథచివరకిగాని అది మానలేదు. రాజుగారికి భగవంతుడు కలలో కనబడి అనేక నిజమైన వస్తువులను ఇచ్చేడు. రాజనగరులో పగడాల మేడలు, రత్నాల మేడలు, బంగారు మేడలు ఉన్నాయిట !

### ఒరవడికథ

కథాకల్పనకేగాక ఆఖరికి పాత్రల పేళ్ళకికూడ కాంభోజరాజుకథ ఆదర్శకథయిపోయింది. జంగంకథలలో అతిలోక కల్పన, అతిశయోక్తులు సాధారణం. తక్కిన కథలలోకూడ మాణిక్యదేవి, రంగసాని, నాగేంద్రుడు మొదలైనపేళ్లు వస్తాయి. ఈ పేళ్లన్నీ ఒక్కలాగే ఉండడానికి ఒక ముఖ్యకారణం లేకపోలేదు. పాటకులు జ్ఞాపకం పెట్టుకోడానికి సులభంగా ఈ పేళ్లన్నిటిని ఒక్కలాగే చేసేరు.

ఈ రకం కథలలో గుర్రం ఒకటి తప్పదు.

ఇట్టి సంప్రదాయాలే ఈ రకం కథలలో ఒక్కొక్కప్పుడు కొంచెం మార్పుతో కనబడతాయి. ఈ మొత్తంగా కాంభోజరాజుకథ తర్వాత జంగం కథలకు ఒరవడికథ అయింది.

### సమకాల రాజకీయస్థితి

ఈ కథకి ఎంతోకాలం తర్వాత బయలుదేరిన అనేక జంగంకథలనుంచి మనకు సమకాల రాజకీయ స్థితులు విశేషంగా తెలుస్తున్నాయి. కాని ఈ పాటలో అటువంటివి అట్టే కనబడకపోడం శోచనీయం. కథ చిన్నదిగాకపోయినా, రచన చిన్నదిగా ఉండడం ఒక కారణం.

చెరబండిరాజు తిరిగిన దక్షిణదేశంలో రాజ్యాలు లేవా ? రెండుచోట్ల రాక్షసుల పట్టణాలున్నాయి. మరొక పట్టణంలోమాత్రం రంగసాని ప్రధానంగా కనబడతూంది.

### సాంఘికస్థితి

మహారాజు అనేకమందిని వివాహమాడేవాడు. సంతానంలేకపోగా తీర్థయాత్రలుచేసి నోములుపట్టేవారు. పుత్రసంతతికోసం రాజు రామలింగస్వామిని ప్రతిష్ఠచేసేడు ; కోనేటిని తవ్వించేడు. రాజుకి పారువేట అంటే ఇష్టం. రాజుగారి శ్రవణానికి సర

మేధస్సుతో వైద్యమట ! రాజు కొలువులో మంత్రి, కవీశ్వరులు, మహాపెద్దలు, భట్లు, అరవైమంది జట్టీలు ఉన్నారు. (పుట 22). ధనాన్ని జాగ్రత్తపెట్టే ఉద్యోగి వరాబుట ! రాజుగారు నిరంకుశుడు.

మాణిక్యదేవికి రాతి విగ్రహంలో నమ్మకంలేక పోయినందున ఆమె దుష్ఫలాన్ని సంపాదించుకొంది. కారాగారంలోపడింది. అనేక శిక్షలను భరించి, అంతటిలో తెలివితెచ్చుకొని, 'ఇది భగవంతుని చర్యకదా' అని గ్రహించుకొని దైవభక్తిపరురాలయి, మంచి ఫలితాలను పొందింది.

రాక్షసులు నరమాంస భక్షకులు. ఒక్కొక్కప్పుడు వారి చక్కదనాన్ని చూచి పెంచి పెద్దవారిని చేసి పెళ్లిచేసేవారు. గర్భిణిరైన తల్లినిచంపి, ఆమె కడుపులోని శిశువు చక్కదనాన్ని చూచి పెంచేరు. ఆ బిడ్డపేరే రత్నాలగంధి. చెరబంద్రి రాజు దక్షిణదేశానికివెళ్ళి స్త్రీలను వివాహమాడేడు.

ఆ కాలంలో వేశ్యలున్నారు. కాని వారిపదవికి ఇటీవలికాలంలోని వేశ్యలపదవికి పోలికలేదు. రంగసాని పేరుకి మాత్రమే భోగంది. ఆమె ముప్పైమూడు విద్యలలో నైపుణ్యం సంపాదించుకొంది. ఆమె మంత్రాలతో మాయచేసింది. తనయందు మోహాపారవశ్యంతో వచ్చిన రాజులను గులాములు చేసింది. ఆ కాలంలో దాసుల (Slaves) చేత వెట్టిచాకిరీ చేయించుకొనేవారు. వారుండే తావులకు 'వెట్టి కొట్టాలు' అనిపేరు.

దేవుడువచ్చి అన్ని పనులుచేసి పోతూంటాడు అనే నమ్మకముంది. ఇంద్రజాలవిద్య కడు సామాన్యం. రత్నాలగంధి చెరబందిరాజును బంగారు బల్లిగా మార్చివేసింది.

ఈ కథాకాలంలో శైవసంప్రదాయమేగాని వైష్ణవ సంప్రదాయంలేదు. మాణిక్యదేవికి దేవుడి మహిమలో నమ్మకం లేనందువల్ల కష్టాలపాలయింది యువతీ యువకులు వలసలకు పోయేవారు.

ఆ కాలంలో నేరస్తులకు రాజువేసే శిక్షలు కొన్ని-

చెరబంధిఖాన కట్టమన్నాడు
కాళ్లసంకెళ్లు వేయమన్నాడు
చేతిసంకెళ్లు వేయమన్నాడు
ఉక్కుమంచం వేయమన్నాడు.

మరికొన్ని శిక్షలు-కనురెప్పలకు చీనా సూదులు గుచ్చడం, నోటికి కప్పతాళం వేయడం (14) ఘోరారణ్యంలో ఒక తట్టు కత్తులు, ఒకవైపు మంగలి కత్తులు, పక్కన పంమంపల్లేరుకాయలు, చేతులకు బేడీలు, ఏడుమణుగుల చట్టుబండ ఎదురొమ్మున పెట్టడం (21). ఈ శిక్షలను అమలుజరిపేవారు వీరముష్టులు.

అప్పుడు సముద్రంమీద ప్రయాణం సామాన్యం. యాత్రీకులు అన్న సత్రాలలో భోంచేసేవారు. వారికి సదా వృత్తులుండేవి. పూటకూళ్ల ఇళ్లుకూడ ఉండేవి. ఆ నాడు విద్యల్లన్నీ ముప్పైమూడు.

ఈ కాలంలో అనగా ఇరవైయో శతాబ్దంలో మనం కొన్ని కట్లను (Bandages) గురించి వింటాము. ఆ కాలంలో కట్లుకూడ ఎన్నో రకాలు. రాజుగారి వ్రణాలకు కట్టిన కట్లలో కొన్ని - కోడికట్టు, మేకకట్టు, నరకట్టు (!). మందుల రకాలు చూడండి ! మైలాభరణి, మచ్చుమాయలమందు, రామలక్ష్మణులమందు మొదలైనవి. ఆ కాలంలోని యంత్రశాస్త్రం గురించి పూర్వమే తెలియచేసేను.

ఆ కాలంలో ముప్పైరెండు ఆయుధాలు (యుద్ధ పరికరాలు) ఉన్నాయి. ప్రాచీనకాలంలోని యుద్ధ

పరికరాదులను తెలియజేసే సంస్కృత గ్రంథం ఇటీవల ఒకటి దొరికింది. దీనిపేరు నీతి ప్రకాశిక. *

## కథానాయకుడు

ఈ కథలోని నాయకుడు చెరబండిరాజు. అతను పుట్టిన విధమే చిత్రమైనది. తల్లి చెరలో ఉండగా దేవతల వరంవల్ల జన్మించేడు. దేవతలే అతన్ని పన్నెండేళ్లపాటు పెంచి పెద్దజేసి విద్యనేర్పేరు. అతను 'మహిమగల పుత్రుడు.' తల్లిదండ్రులను ఒక్కచోట చేర్చేడు. తాను దేశాలుతిరిగి వివాహ మాడేడు. అన్నలు తననుచంపినా వారిని క్షమించి రక్షించేడు. ఇట్లు ఇతను సగం దైవం, సగం నరుడు. కాబట్టి ఇతను అతిలోక (Supernatural) వీరుడు. అయితే ఇటువంటి వీరుని అవసరమేమిటి? ఆ కాలపు ప్రజలు తమవంటి నరుడే బుద్ధిగలిగి గొప్ప పనులు చేసేడంటే నమ్మరు. అద్భుతమైన వ్యక్తి మాత్రమే అద్భుతమైనపనులు చేయగలడని వారి ఉద్దేశం. కథలో అతిలోక పాత్రలు, అతిలోక విషయాలు ఉంటేనే వారికి ఇష్టం. కబట్టి చెరబండిరాజు మొదటినుంచి చివరిదాక అద్భుతంగా తయారయేడు.

## నాయకి ; కవి సందేశం

కథలోని నాయకి అనగానే నాయకునిభార్య అని తలచేరు సుమండీ! అది కొన్ని కథలలో మాత్రమే నిజం. ఈ కథ సంగతివేరు. కథలో నాయకుడితో సమాన ప్రాముఖ్యత వహించిన స్త్రీ పాత్ర నాయకి. ఆమె మాణిక్యదేవి, నాయకుడైన చెరబండిరాజు తల్లి. ఆమె అనేక అపవాదుల పాలయింది. దేవతలే చివరకి కాపాడేరు. నాయకుణ్ణి కంది. అతనివల్ల చెరనుంచి విముక్తి పొందింది. ఆమె సామాన్య స్త్రీ కాదు. ఆమెకూడ అర్ధదైవ వీరాంగన.

ఈ జానపదకవి వేలకొద్దీ ఏళ్లక్రిందటే ఆంధ్ర దేశానికిచ్చిన అమూల్యమైనపాత్ర మాణిక్యదేవి. ఆమె మొదటిలో బౌద్ధమత ప్రాబల్యంవల్ల రాతి విగ్రహాలను నమ్మదు. హేళనగా కాగలించుకొంది. పట్టు పరుపులమీద పండుకొని ప్రార్థిస్తుందిట! వాటి దుష్ఫలితాలను వెంటనే పొందింది. జ్ఞానోదయ మయింది. పశ్చాత్తాపపడింది. భగవంతుడికోసం ఆమె త్యాగం చేయలేనిది లేదు. ఈశ్వర సహాయం కలిగింది. ఈ పాత్ర ఈ నాటి అనగా ఇరవైయో శతాబ్దపు ఆంధ్ర దేశానికి సందేశమిచ్చే పాత్ర. ఇన్ని శతాబ్దాలపాటు నిజంగా ఆ పాత్ర సందేశమిస్తూనే ఉంది. ఈశ్వరుని సందేహించడంవల్ల ఘోరమైన ప్రమాదాలున్నాయి. ప్రమాదాలనుంచి మానవ లోకాన్ని రక్షించగలిగినవాడు ఆ సృష్టికర్త ఒక్కడే!

---

* నీతి ప్రకాశికయను సంస్కృత గ్రంథం వైశంపాయన రచితము. ఇందు రణశాస్త్రము వివరింపబడినదట. ఇతడు వ్యాస శిష్యుడు. పరీక్షిత పుత్రుడు, పాండవ ప్రపౌత్రుడునగు జనమేజయునికి గురువు. ఇందు అస్త్రశస్త్రాదులనుగూర్చియు, వ్యూహములను గూర్చియు, సైన్యములను చేర్చుకొనుట గూర్చియు వివరింపబడినది. సైన్యము దండెత్తబోవుట, వారికి సరఫరాలు, శిబిరములు నిర్మించుట, సైనికులనంటినడచు సంగీత నిపుణులు, వాద్య విశేషములు, గూఢచారులు, రాజు అంగరక్షకులు, ఒకటేమిటి ఆధునిక రణశాస్త్రమున ఎన్ని చెప్పబడినవో, ఆధునిక యుద్ధములలో ఎన్ని అవలంబింపబడినవో అన్నియు వివరింపబడినవి. వ్రణితులకు చికిత్సా నిధానము పేర్కొనబడినది. సైనికుల జీత బత్తెములు పొందుపరుపబడినవి. అయితే వీరు నీతినియమములను పాటించిరి. విషదిగ్ధమగు ఆయుధముల విసరరాదు. కౌరవుల వంటివి రువ్వరాదు. యంత్రముల సాయమున రాళ్లు వర్షింపరాదు. క్షుద్రమంత్ర శాస్త్రమును ఆశ్రయింపరాదు. శత్రువు కొట్టవలదని సంజ్ఞచేయుచో కొట్టరాదు. అట్టి సంజ్ఞ లిరువది పేర్కొనబడినవి. భారత రామాయణములలో నివియన్నియు వర్ణింపబడినవి. కాని అవి పురాణముల క్రింద జమ అగుచున్నవి. అయితే శాస్త్ర గ్రంథము ప్రామాణ్య గ్రంథము. వ్యాసుని నాటికే మన రణశాస్త్రమెంత అభివృద్ధిగాంచెనో దీన ప్రకటితము (త్రిలిఙ్గ 29.3 54).

ఇట్టి అద్భుతమైన పాత్రను ఇచ్చినందుకు ఈ కవి మనకు పూజనీయుడు.

### రంగసాని

రంగసాని పేరుకి మాత్రమే వేశ్య. ఇటువంటి పాత్రలు వాఙ్మయంలో కొన్ని ఉన్నాయి. శూద్రక మహాకవి (క్రీస్తు పూర్వం మొదటి శతాబ్ది) మృచ్ఛకటిక నాటకంలో వసంతసేన అను పాత్రను సృష్టించేడు. ఈ పాత్ర ఇంకా అంతకు పూర్వంనుంచి ఉంది. క్రీస్తు పూర్వం అయిదో శతాబ్ది అతనని చెప్పతగిన భాసుడు వసంతసేన పాత్రను మొదట కల్పించేడు. ఈమె విద్యావతి, శీలవతి. తమిళ భాషలో ప్రాచీన గ్రంథాలైన శిలప్పదికారం, మణిమేకలై అను వాటిలో నాయికలు వేశ్యలు. 'పద్దెనిమిది వందలేళ్ళకిందట తమిళులు' * అను గ్రంథంలో వేశ్యలు చాల ఉత్తమ పాత్రలుగా ఉండేవారు అని వ్రాయబడింది. పూర్వ గ్రంథమైన కాంభోజరాజు కథలోని రంగనాయకి ఉత్తమపాత్ర. రావిపాటి త్రిపురాంతకుడు అనే ఆంధ్రకవి (క్రీ. శ. 1350) ప్రేమాభిరామంలో మాచలదేవి అను వారాంగన ఘనతను వర్ణించినట్లుగా వల్లభరాయని క్రీడాభిరామున్నిబట్టి తెలుస్తూంది. పింగళిసూరన్న (క్రీ. శ 1540) కలభాషిణి అను ఉత్తమ వేశ్య పాత్రను కల్పించేడు. రంగసాని ఈ వర్గానికి చెందిన అద్భుత పాత్ర.

(సశేషము)

* గ్రంథకర్తపేరు వి. కనకసభై

# ఆప్తులెవరు?

శ్రీమతి వి. వినత



రమ ఒక సామాన్య కుటుంబీకుని కుమార్తె. తండ్రి శంకరంగారికి. రమ, సుందర్ తప్ప మరెవ్వరు లేరు. రమ అల్లారు ముద్దుగా పెరిగింది. ఆమె చిన్నతనములో ఏదో వీధిబడిలో చదువుకున్నది. తండ్రి పూర్వాచారపరాయణుడగుటచేత, అర్థము, శుభము తెలియని రమకు ఆరవ యేటనే వైభవముగా వివాహము చేశారు. రమకు నెమ్మదిగా స్వేచ్ఛ నశించింది.

ఇల్లే స్వర్గమయింది. చదువుకూడా మాని పించారు

ఆమె పదునాల్గవయేటనే అత్తవారింటికి కాపరానికి వెళ్లింది. కాపరానికి వెళ్లిన రెండేళ్లలోనే 'శశి' పుట్టింది. కాని పాపం 'రమ' పచ్చగా పాతికేళ్లపాటైనా పసుపు కుంకుమ పెట్టుకునేందుకు నోచుకోలేదు. శశికి యేడాది తిరుగకముందే భర్త మరణించాడు. శంకరంగారు, రమను, శశిని యింటికితీసుకువచ్చారు. అసలేగంపెడు దుఃఖముతోవున్న రమకు గోరుచుట్టు మీద రోకటి పోటయినట్లు తండ్రికూడా మరణించాడు.

రమకు యిప్పుడు అన్నగారి వద్దనే ఆశ్రయము. రమవెళ్లిన కొత్తల్లో తన అన్నగారు, వదినెగారు యెంతో ప్రేమతో చూచేవారు. ఒకరోజున సాయంకాలము శశి, తన మామయ్య కూతురైన బుజ్జితో ఆడుకుంటోంది. యేదో చిన్నపోట్లాటవచ్చి, శశిని బుజ్జి పడత్రోసి లోపలవున్న తల్లి దగ్గరకు వెళ్లి 'అమ్మా' నన్ను శశి కొట్టిందే అని యేడవసాగింది. ఆమె గబగబావంట చేస్తున్న రమదగ్గరకువెళ్లి, "యేమి సోద్యముమ్మా నీ ముద్దుల కూతురు నాచిట్టి తల్లిని యెట్లా కొట్టిందో చూడు" అని యింకా యేదో చెప్పబోతూవుండగా, శశిచెంప మీదనుండి కారుతూన్న నెత్తురును తుడుస్తూ, "పాపము బుజ్జిని కొట్టావుటగా, తప్పుగాదూ? అసలు జరిగినదేమిటో చెప్పు" అన్నది. "నేను బొమ్మను పెట్టి ఆడుకుంటూవుంటే బుజ్జి నా బొమ్మనుకాస్తా లాక్కొన్నది. నా బొమ్మను నాకు యిమ్మని చేత్తో పట్టుకున్నాను. తన బొమ్మట-తనకు కావాలిట, అని ఒక త్రోపుత్రోసి లోపలికి వచ్చేసింది" అంటూ బావురమని యేడ్చింది శశి. "లేదే అమ్మా బొమ్మను తీసుకోబోయి కాలుజారిపడ్డది" అన్నది బుజ్జి. "యేమిటోనమ్మా లేనిపోని గొడవ నేలది తీసుకునెత్తికి రాచుకున్నారు మీ అన్నయ్య" అన్నది విసుగుతో వదినెగారు. రమ యేమీ మాట్లాడకుండాయింట్లోకి పోయింది. రాను రాను యింటిలోని పని బండెడుచాకిరీ రమ మీదపడ్డది. యెంత చేసినా వెనకనుంచి వదినెగారు సాధిస్తునే యుండేది. రమ దేనికీకూడా యెదురు తిరిగి సమాధానము చెప్పేదికాదు. ప్రతిరోజూ యేదో ఒకచిన్న పోట్లాటలేనిదే రోజు గడిచేదికాదు. ఒకొక్కసారి అకారణంగా అన్నగారు కూడా రమమీద విసుక్కొనేవాడు.

ఒకరోజు సాయంకాలము బుజ్జికి మామిడిపిందెల జరీపరికిణీ, జాకెట్టుతొడిగి వసారాలో జడవేస్తోంది వదినెగారు. శశి, బుజ్జి బట్టలుచూచి పరుగున రమవద్దకువచ్చి అటువంటి పరికిణీ చొక్కా యీయవే అన్నది. వినీవిననట్లు వూరుకొన్నది రమ. తిరిగి 'యీయవూ' అన్నట్లుమారాం పెట్టింది

శశి. 'నీవు కట్టుకున్నవి బాగున్నాయి; అట్లా యేడుస్తారా!' అన్నది రమ యేడుస్తున్న శశిని వోదారుస్తూ. 'కాదుయివి చినిగాయి, అటువంటివే కావాలి' అని యేడుస్తోంది శశి. ఇంతట్లో వసారాలోంచి బుజ్జి "చూచావుటే అమ్మా, నేనేమో మంచి బట్టలు కట్టుకున్నానని, యేమిటో తిడుతూ మెటికలు విరుస్తోంది అత్తయ్య," అన్నది. వదినెగారు అందుకుని, "నీకు యేమిపోయే కాలంవచ్చిందే – నా కూతురు బాగుంటే చూడలేవుటే. యెవరైనా కాస్తమంచి బట్టలు కట్టుకుంటే చూచి వోర్వలేవు" అని యేమో అంటోంది. రమవచ్చి "లేదు వదినా!, నేను యేమీ అనలేదు. శశివచ్చి బట్టలు యిమ్మని యేడుస్తూవుంటే దాన్ని వోదారుస్తున్నాగాని, బుజ్జిని యేమీ అనలేదు" అన్నది. "చాల్లేవే అమ్మా! నీ మాయమాటలు – యిన్నాళ్లు యేపోరు లేకుండా హాయిగా వున్నాము" అంటూ వుండగా, అప్పుడే లోపలకువస్తున్న అన్నగారు – కోపంగా "ఎప్పుడూ వెధవగొడవ యేదో! యిట్లా పోట్లాడేటట్లయితే నా యింటిలో వుండనక్కరలేదు, తక్షణంలేచి పో" అన్నాడు రమను – భార్య ప్రోద్బలం అయితేనేమి, యింక దేనివల్లనయితేనేమి. యివన్నీ వింటూవున్న రమకు కళ్లలో నీళ్లు గిఱ్ఱున తిరిగాయి. తన అసమర్థతకు తన్ను తాను నిందించుకొంది. తనకేమీ చేయాలో తోచలేదు. తన భర్తవుంటే యిలాటివి అన్నీ యెందుకు వచ్చేవి? మనస్సులో యేదో రైళ్లు పరుగెత్తసాగాయి. రమకు ఆరోజు రాత్రి అన్నము సయించలేదు. పక్కమీద పడుకున్నదన్నమాటేగాని నిద్రపట్టలేదు. ఆమెలో యేదో ఆలోచనలు–తను యెక్కడకు వెళ్లుతుంది? తన అన్నగారు తప్ప దిక్కెవ్వరు? యేనుయ్యో చూచుకొందామనుకొంది. కాని తనశశి ...మనస్సులో యేదో చివుక్కుమన్నది. ఆమె యెక్కడకైనా వెడదామంటే చేతిలో చిల్లిగవ్వలేదు. పూర్వము తనతండ్రి పెళ్లికి పెట్టిన రెండు జతలగాజులు చేతికివున్నాయి.

ఆమెకు రానురాను ఇంట్లో వుండటము దుర్భరముగానున్నది. ఒకనాటి రాత్రి గట్టిగా ఆలోచించింది రమ. ఆ నాడు నిద్రపట్టలేదు. ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు. గంటమూడు కొట్టింది. తను యెచ్చటకో వెడదామని–యెక్కడికి తన ప్రయాణము? ఎక్కడికో తనకే తెలియదు. యేదో తప్పుచేస్తున్నట్టుగా తోస్తోంది. బుజ్జి దీపము మినుకు, మినుకుమంటోంది. నిద్రపోతున్న శశిని యెత్తుకుని మెల్లిగా వాకిట్లోకివచ్చింది, కాని కాళ్లుముందుకు సాగనీయుటములేదు. తలుపు మెల్లిగా తెరచి వారవాకిలిగావేసి స్టేషనుకు బయలుదేరి వెళ్లింది. వారికోసం యెదురుచూస్తున్నట్లు రైలు సమయ్యానికి వచ్చింది.

మద్రాసు వెళ్లేది కాబోలు! రమ దాంట్లో యెక్కింది. రైలు వేగంగా వెళ్లుతోంది. యెక్కడికి వెళ్లటము ? వెళ్లి యెక్కడ వుండటము?-ఆలోచనలో పడ్డదిరమ. శశి నిద్రనుంచి లేచి "అమ్మా! యెక్కడికే వెడుతున్నది. మామయ్యా అత్తయ్యా వాళ్లు యేరి" అన్నది. రమకు యేమి చెప్పాలో తెలియలేదు. "ఇది యెక్కడకు తీసుకువెళ్లితే అక్కడకు"అన్నది.

ఉదయం ఆరుగంటలకు ట్రయిను మద్రాసు చేరుకొంది. కూలీ,కూలీ అంటూ కూలీలు రైలుచుట్టూ మూగారు. రమ, శశి, ట్రయిను దిగారు. తిన్నగా బయటకు వచ్చారు. ఎండ తీవ్రముగా వుండుటవల్ల కాబోలు శశి ఆకలికి యేడ్చింది. అక్కడ అరటిపళ్లు, మామిడిపళ్లు కొని పెట్టింది రమ. ప్రక్కనుంచి రిక్షావాడు 'ఎంగే పోగణుం! యిదిలో యేరమ్మా' అన్నాడు. రమకు అరవం అర్థముకాదు. ట్రాములు, ఆటోరిక్షాలు - ఒకటేమిటి అన్నీ కొత్తగావున్నాయి. అట్లా నడిచే పోతున్నారు. త్రోవలో ఒక స్త్రీ వారిని చూచి "ఎవరమ్మా! మీారు? యెక్కడకి వెళ్లాలి" అన్నది. "ఎక్కడికీలేదు" అన్నది రమ. "నీ పేరు యేమిటమ్మా? నిన్ను యెక్కడో చూచినట్లువున్నది. మీా ఈ దీనస్తితి చూస్తూవుంటే జాలివేస్తూ యున్నది. తల్లీ, తండ్రీలేరా" అన్నది ఆమె. రమ, "ఈ అభాగ్యురాలి వునికి దేనికమ్మా" అంటూ వుండగా, కళ్ల వెంట నీళ్లు బొటబొట కారాయి. ఆమె "తిరిగి చెప్పమ్మా! చెప్పు" అన్నది. "నా తండ్రి చిన్నతనములోనే నాకు వివాహము చేశాడు. కాపరానికివెళ్లిన రెండు యేళ్లకు శశిపుట్టింది. ఇది పుట్టిన యేడాదికే నా భర్త మరణించారు. తరువాత మా నాన్నదగ్గరకు వచ్చాను. నాఖర్మ - అక్కడకు వెళ్ళిన కొన్నాళ్లకే నాన్నకూడా తనువు చాలించారు" అంటూ వుండగా, ఆ యువతి అందుకుని "యేదో చిన్నతనము జ్ఞాపకము వస్తున్నది. అచ్చము నీలాగే వుండేది ఆ అమ్మాయి! ఆ అమ్మాయి నేనూ యెంతో స్నేహముగా వుండే వాళ్లము. తరువాత నాచదువునుగూర్చి ఈ వూళ్లో కాపరం పెట్టారు మానాన్న. నీవు చెపుతూవుంటే అంతా యేమిటోలా గున్నది, నీపేరు యేమిటోచెప్పు" అన్నది. "నాపేరు రమ" అనబోతూ వుంటే, "రమ...నీవే ఆ..."అని కౌగలించుకొంది ఆమె. "ఈ దరిద్రురాలు ఇంకా జ్ఞాపకము వుందా! అబ్బా యెన్నాళ్లకు నిన్ను చూడ కలిగాను" అన్నది రమ. కారులోంచి పిల్లవాడు హారనుచేశాడు. ముగ్గురుయింటికి కారులో వెళ్లారు. రమ ఇప్పుడు ఎమ్.బి.బి. ఎస్.చదివి స్వంతంగా వైద్యశాల పెట్టింది. మాంచిప్రాక్టీసు. శశిని దగ్గరవున్న అనాథశరణాలయంలోచేర్చి, తను రోగులకు సేవచేస్తూ అచ్చటే వుండి పోయింది రమ.



# విశ్వజ్యోతి

"రాయసం సోదరీమణులు"

(గతసంచిక తరువాయి)

## ఆరవ రంగము

[ఒక ఇంటిలోపల గదిలో మంచము - దానిక్రింద కఱ్ఱ. గోడకు కొన్ని దేముళ్ళపటములు తగిలించి వుంటాయి. గదికి ఒక కిటికీ వుంటుంది. అంతా చీకటి మయము. ఏదో వెతుకుతున్నట్లు కిటికిలోనించి బ్యాటరీలైట్ వెలుతురు మూడు, నాలుగుసార్లు ఆ గది గోడలమీద కనిపిస్తుంది. తరువాత మంచము మీద పండుకొన్న చంద్రయ్య ముఖముమీద ఒక నిమిషముంటుంది. మోహన్ మాసినపైజామా, పెరిగిన గడ్డము, మాసిన చొక్కాతో ప్రవేశిస్తాడు.]

మో:-చంద్రయ్యా ! లే - నీపాపము పండింది. నిక్షేపములాంటి సుధాకర్ సంసారాన్ని చిచ్చుబెట్టడానికి ప్రయత్నించావు.

చం:-(కళ్లుతెరచి కూర్చుంటాడు) ఏం మోహన్ ఇంత రాత్రప్పుడు వచ్చావు - కూర్చో.

మో:-(వికటంగా నవ్వుతాడు) ఆ ... ఏమిగౌరవము ... ఏం గౌరవము. చంద్రయ్యా నీకేం ! నీకు ప్రపంచముతో, మునిసిపాలిటితో ఇకఎలాంటి సంబంధము లేకుండాపోతుంది. అదృష్టవంతుడివి. నీవు బ్రతికిన బ్రతుక్కు యింక నాలుగు కాలములు బ్రతికివున్నట్లయితే ఇలాంటి సులభమైనచావు వచ్చేదికాదేమో ? అదృష్టముతో పెట్టిపుట్టినవాడివి. (పెద్దగానవ్వి తరువాత ఆపి సీరియస్‌గా) నీలాంటి ఛీడపురుగులుపోతేగాని సామాన్య కుటుంబాలు బాగుపడవు. నిన్ను చిత్రవధ చేయించినా పాపములేదుకదా !

చం:-ఏం పెద్ద మొగవాడిమాదిరిగా బెదిరిస్తున్నావు. ఏం చంపుతావా ? మర్యాదగాపో. మోహన్ నీ మంచికోరి చెపుతున్నాను విను. ఏదో చదువుకున్నవాడివి. మా మునిసిపాలిటిలో నాలుగు రాళ్ళు తెచ్చుకొని నిక్షేపంగా బ్రతుకుదువుగాని, లేకపోతే ...

మో:-నీ దగ్గిర పనిచేయమంటవా ? లేకపోతే నీవు పోయే నరకమునుంచి పోలీసులను పంపిస్తావా - అరెస్టువారెంట్ ఇచ్చి.

చం:-మోహన్ ఈసారి నిన్నే ఛైర్‌మన్‌గాచేస్తాను. ఇదే ఆఖరు సంవత్సరము నేను ఛైర్‌మన్‌గా వుండడము. నేను మాత్రము ఎన్నిరోజులుంటాను?

మో:-(నవ్వి) ఎంతమారిపోయినావు చంద్రయ్యా ! మనిద్దరము ఆ లోకమ్ములో పోటీ చేద్దాము. అప్పుడు కాస్త సహాయంచెయ్యి. (కొంచెము ఆలోచించి)చంద్రయ్యా, చేసిన పాపములన్నిటికి ఒక్కసారి పశ్చాత్తాపపడు; కొంతవరకైనా శాంతి లభిస్తుంది. ఇహపర లోకములలో ముఖ్యంగా మన వూరిలో ప్రజలు సుఖిస్తారు. ఎలాంటి భేదాభిప్రాయాలుండవు. (అంటూ కత్తితీసి పొడుస్తాడు.)

[రక్తపు మరకలు ఇద్దరి గుడ్డలమీద వుంటవి.]

చం:-అబ్బా ... హంతకుడు ... మోహన్ ...పట్టుకోండి. (కూలుతాడు.)

మో:-పిచ్చివాడా ! నేనా హంతకుణ్ని ! నేను నీ ఒక్కడి ప్రాణము తీశాను. నివ్వో ... ఎందరి ప్రాణాలను నిలువున తీశావు! ఎన్ని సంసారాలను స్మశానాలుగా చేశావు! నన్ను ఎవ్వరు పట్టుకోనక్కరలేదు. నేనేపోయి గర్వంగా చెప్పుకుంటాను నేనుచేసిన మహోపకారాన్ని. వాళ్లు

నమ్మకపోతే ప్రేక్షకమహాశయులు సాక్ష్యము చెప్తారు చంద్రయ్యా! (నవ్వుతాడు.)

(తెర)

## ఏడవ రంగము

[సుధాకర్ మనోహర్‌లు కుర్చీలలో కూర్చొనుంటారు.]

మ:-ఇది విన్నావా సుధాకర్! మన చంద్రయ్య మనము పనిచేసే బ్యాంకు మేనేజరుతో మనల్ని గురించి అసహ్యంగా మాట్లాడాడట. ఎన్నిరోజులని ఇలా పూరుకోటము? నీవింకా సత్యకాలపు మనిషివి. చంద్రయ్యకు అధికారముందని ఇష్టమొచ్చినట్లు వినియోగించుకోడమా? చంద్రయ్య మనకు చేసేఅపకారాల్ని విని జ్యోతిఎంత విచారిస్తున్నది!

సు:-అవును మనోహర్ జ్యోతిలో ఇప్పుడు పూర్వము వుండే ఉత్సాహముగానీ, ఆనందముగానీ కనిపించడములేదు. చంద్రయ్య ఇంకా ఎన్నాళ్లు సాధిస్తాడో!

సరళ:-(ప్రవేశం) జ్యోతి ఏది తన గదిలోలేదు. ఇంట్లో కనిపించడములేదు. ఇల్లువదలి బయటికి పోదే! పూరంతా మనకు విరోధులేకదూ - ఏమయిందో ఎటుపోయిందో.

[సుధాకర్, మనోహర్ జ్యోతిని వెతుకుతున్నారు.]

[లోపలినుంచి ఒక పురుష కంఠము]

"సుధాకర్‌గారు! జ్యోతమ్మ భావిలో పడ్డారండి. జనమంతా అక్కడచేరారు. త్వరగారండి."

మ:-నేను చెప్పానుకదా సుధాకర్! జ్యోతి దాటిపోయింది.

స:-(ఆ! అంటూ నిర్ఘాంతపోయి కూలిపోతుంది)

(తెర)

## ఎనిమిదవ రంగము

[రచ్చబండ - జ్యోతి శవాన్ని సుధాకర్ మనోహర్‌లు మోసుకొస్తుంటారు రచ్చబండదగ్గరకు. మనోహర్ ఏడుస్తుంటాడు. జ్యోతిని రచ్చబండ మీద పరుండబెట్టిరి.]

సు:-పెద్దలందరికి మా నమస్కారములు. మా జ్యోతి శవాన్ని మీరుచూస్తున్నారు. చూపించి మీ దగ్గర సానుభూతి పొందుదామని, లేకపోతే నా ఉపన్యాసంతో మిమ్మల్ని స్తంభితులుగా చెయ్యడం నా ఉద్దేశ్యముకాదు. సంఘాచారాలకు అవినీతులకు బలిఅయిపోయింది అమాయికురాలు. వివాహము రద్దయింది. ఇంక నాకు ఆనందము. మీకు మేమంటే తీరని అభిమానము. (నవ్వుతాడు విషాదంగా) ఇప్పుడు మీ ఊరి గౌరవము దక్కింది. మీ సంఘము అమోదిస్తుంది. మనోహర్! నాకు ఇంక జ్యోతి కనబడదు. జ్యోతీ! నీ వెందుకు భయపడ్డావు ఈ సంఘానికి? నిన్ను మేము కాపాడలేమని నీ ఉద్దేశ్యమా! అమ్మా, అమ్మా అని అరుస్తూన్నా పశువులరోదనైననూ వినిపించుకోకుండా తన వృత్తిని నిర్వర్తించే కసాయివాడై వెయ్యిరెట్లు మేలు ఈ సంఘములోని మానవుడికన్న; మానవత్వము నశించింది ఈ సంఘములో. ఒక మనిషి ఇంకొక మనిషి గర్తాన్ని పీల్చి జీవించడానికి తయారు అవుతున్నాడు. అలాంటప్పుడు కనికరము ఎక్కడినుంచి వస్తుంది. మీ అందరి దృష్టిలో జ్యోతి ఒక సామాన్య స్త్రీ, కాని మా దృష్టిలో ఒక మహనీయురాలు. ఎన్ని సార్లు దూషించింది ఈ సంఘాన్ని! ప్రపంచాన్ని చూచి. ఆ ఘోషంతా సముద్రపు ఘోషకదూ? ప్రతి ఒక్కరూ జ్యోతి ఆదర్శాలను పాటిస్తే సంఘము సంతోషముతో నిండిపోదూ? స్త్రీ స్వతంత్రురాలని, భగవత్ దృష్టిలో స్త్రీకి సర్వాధికారము లున్నవి, కాని

నీచాతి నీచమైన సంఘములో స్త్రీ మూర్తికి ఎలాంటి స్థానము లేదని వాపొయ్యావే - నీవు సంఘ సంస్కర్త వవుతావని ఎంతగానో సంతోషించామే - నన్నీ భయంకర మృగాలమధ్యవదలి, హాయిగా స్వర్గవీథులలో విహరించడానికి పొయ్యావా! జ్యోతీ! జ్యోతి తన జీవిత జ్యోతిని వెలిగించుకొని ఆనందిస్తున్నదని ఎంతగానో బాధపడ్డారు. మీ బాధ తీరిపోయింది. అనూయప్రబలి వివాహాన్ని రద్దుచేయమన్నారు. మా ఉద్యోగాలు తీసివేశారు. అన్ని విధాల బాధించారు. కాని మా జ్యోతి ముఖము కళకళలాడుతుంటే ఆ బాధలన్నీ మేము మర్చిపొయ్యాము. ఈ బాధలకంతా కారణము ఈ సంఘమనేమాట మరచిపోయి తానే అని ఊహించుకొని తను లేకపోతే మేము సుఖపడుతామని ఆత్మహత్య చేసుకుంది. మీ అభిప్రాయము ఒక స్త్రీకి భర్త లేకపోతే ఆ స్త్రీకి ప్రపంచములో వ్యక్తిత్వము లేనట్లేనా! ఎన్నాళ్లకు కలుగుతుంది జ్ఞానోదయము మన సంఘాల్లో! ఎన్ని జీవితాలు ఇలా ఆహుతి అయిపోవలెను! పురుషులు ఏవిధంగావున్నా, ఏమిచేసినా ప్రశ్నించేవాళ్ళు లేరు. స్త్రీ విషయములో ఎందుకింత కాఠిన్యము? పునర్వివాహముకాదంటే పురుషుణ్నికూడా ఆటంకపరచండి. చంద్రయ్యను అడిగే మొగవాడే లేకుండాపొయ్యాడా?

[మోహన్ చొక్కామీద రక్తపు మరకలు. పోలీసులు ఖైదుచేసి తీసుకుపోతుంటారు.!]

మో:-ఉన్నాను సుధాకర్. ఇంకేమి చంద్రయ్యా! అంతా బాగుంటే నరకలోకము సరిహద్దులు చేరివుంటాడు. (జ్యోతివంకచూచి) ఆ ... జ్యోతి ఏమయింది!... (జ్యోతి దగ్గిరకు పరిగెత్తడానికి ప్రయత్నిస్తాడు. పోలీసులు ఆపుతారు. పోలీసులతో) అయ్యా మాదనిండు జ్యోతిని, ఇంక నించి అయినా జ్యోతి, సుధాకర్‌ల సంసారము కుదుటపడుతుందని, వాళ్లు సుఖపడుతారని ఈ సంఘములో జరిగే అన్యాయాలు అంతమవుతాయని భ్రమపడ్డాను. అయ్యో జ్యోతి (చేతితో కండ్లను కప్పుకొని వెక్కి-వెక్కి ఏడుస్తాడు. రచ్చబండ దగ్గిరకుపోతాడు పోలీసులతో.) సుధాకర్! మనోహర్! ఏమిచేస్తున్నారు, ఏమిజరిగింది!

సు:-(ఏడుస్తూ) ఆత్మహత్య.

మో:-(నిశ్చేష్టుడై) ఆ ... వీళ్లందరికడుపులు చల్లబడ్డాయి. జ్యోతీ! నీవు విశ్వజ్యోతిని వెలిగించావు. ఈ దుష్ట మృగాలతో కూడిన సంఘములో విశ్వజ్యోతిని వెలిగించావు. (ఏడుస్తూ) మీరంతా ఆదర్శముగా తీసుకోండి జ్యోతి జీవితాన్ని - మీ పాపములంతా నశిస్తాయి. జ్యోతి పాదములకు దణ్ణంపెట్టుకోండి. మీ కోసం బలి అయింది. మిమ్ముల్నందర్ని నాతోపాటు ఉరితియ్యాలి.

సు:-మోహన్ నివ్వో.

మో: సుధాకర్ నేను చంద్రయ్యను హత్యచేసాను, హంతకుణ్ణి. కాని విశ్వకల్యాణానికి తోడ్పడ్డానని సంతోషించాను. ఈ చీడపురుగుపోతే మీరు ఎంతో సుఖపడుతారని ఆశించాను. (మనోహర్‌తో) మనోహర్! నన్ను క్షమించు.

మ:-మోహన్ నీవు ఆదర్శజీవివి. నన్ను క్షమించానను.

సు:-అయితే నీవూ కనపడవా? నీవు అదృశ్యమవుతావా? (అని పట్టుకొని ఏడుస్తాడు.)

పోలీసు:-ఇంక రావయ్యా.

సు.మ:-పోతున్నావా మోహన్ (వెక్కి-వెక్కి ఏడుస్తారు.)

మో:-జ్యోతిని ఆదర్శంగా తీసుకోండి. సంఘాన్ని తీర్చిదిద్దుకోండి.

[జ్యోతిని తీసికొని ఇద్దరూ లేస్తారు. "జ్యోతి ఆదర్శజీవి" అంటూ అరుస్తూ పూలు చల్లుతారు.]

(తెర)

తొమ్మిదవ రంగము

[ఇద్దరు నవనాగరీక యువతీ యువకులు]

స్త్రీ:-ఏమండి! ఇంత అంధకారంలో ఆదీపం యేమిటండి ఈ నిర్జన ప్రదేశంలో.

పురుషుడు:-ఔను. ఆ పక్కనొక గుడిసెకూడ కనిపించడంలేదూ! అందులో మనోహర్ అనే యువకుడున్నాడు. ఆ దీపం మనోహర్ తన భార్యయయిన జ్యోతి సమాధిమీద వెలిగిస్తూంటాడు ప్రతిదినం ... ఆ యువకుడిటు వస్తున్నట్లున్నాడు ...

[ఒక చిరిగినపంచ, మాసిన తల గడ్డంతో మనోహర్ ప్రవేశం]

పు:-అయ్యా మీరేనా మనోహర్.

మ:-కాదు. నాజ్యోతి ... ఔను.

స్త్రీ:-ఇక్కడేనా మీ నివాసం. మీకు తోడెవరు?

మ:-జ్యోతి నాకు తోడు. రోజంతా నాతోనే గడుపుతుంది రాత్రికాగానే నేను దీపం వెలిగిస్తాను. ఇక్కడే బాగుంది జీవితం.

పు:-సుధాకర్ ఏమయినాడు; సరళెక్కడుంది?

మ:-పిచ్చివాడయ్యాడు. సరళ, జ్యోతులిద్దరొక్కచోటికే పొయ్యారు. మీరెవరు? మనుష్యులా! నేనిక్కడనే బాగున్నాను. నన్ను, సుధాకర్‌ను అన్యాయంచేసిన మనుష్యులేనామీరు-పొండి ... మాది వేరే ప్రపంచం. మీరంతా స్మశానాల్లో శవాల్ను పీక్కుతినే నక్కలయ్యారు! నేను మనిషినికాదు దేవతను. అమరత్వాన్ని పొందేను. నా జ్యోతే నాకు సర్వం. మీతోపనిలేదు. చూడండి — ఏలా వెలిగిపోతున్నదో నా జ్యోతి.

(పాట)

నా జీవితజ్యోతి ... ఈ మధురమూర్తి
అనంత ఆనందవిశ్వంలో నిదిరించుము ... జ్యోతి




# యుక్తితో ముక్తి

శ్రీ తిరుమల వెంకటేశ్వర్లు

ఆ గ్రామంలో వెంకయ్య అని ఒక కోమటి యుండేవాడు. అతడు రెండుచేతులా ధనం బాగా ఆర్జించాడు. కాని ఒట్టి పిసినారి. పిల్లికి బిచ్చంపెట్టడు. దానధర్మములంటే తగని అసహ్యం. డబ్బంతా ఇనప్పెట్టెకు పోశాడు.

వెంకయ్యకు రామయ్య, గోపయ్య అని ఇద్దరుకొడుకులు. ఇద్దరూ చాలా తెలివైనవారు. యుక్తిపరులు. వారు తండ్రిని చూసి "ఇంకా ఈ డబ్బాశ ఎందుకు? ఏదో కృష్ణా, రామా అనుకొనుచు కాలము గడపరాదా" నేవారు. కాని వెంకయ్యకు అసలు దైవభక్తిలేదు. తననోటితో 'నారాయణ' అని ఉచ్ఛరించి ఎరుగడు.

తరువాత కొన్నిరోజులకు వెంకయ్యకు జబ్బుచేసెను. కొడుకులు వైద్యుని తీసుకొని వచ్చెదమనగా డబ్బు ఖర్చగునని వెంకయ్య వద్దనెను. మందులేమిచే వెంకయ్య జబ్బు ఎక్కువయ్యెను. తుదకు కొడుకులు బలవంతముగా వైద్యుని తీసుకొనివచ్చిరి.

వైద్యుడు వెంకయ్యను పరీక్షించి "ఇకలాభం లేదు. మందులేక ఆలస్యమగుటచే వ్యాధిముదిరినది. నేడో, రేపో చెప్పలేము" అని వెళ్లిపోయెను. కాని చావుముందుగూడ దేవుని స్మరించలేదు. కొడుకులు 'నారాయణ' అని స్మరింపుమని తండ్రిని బ్రతిమాలిరి కాని తండ్రి వారిమాటలను పెడచెవిని బెట్టెను.

కొడుకులు ఎలాగైనాసరే తండ్రిచే 'నారాయణ' అనిపించి ముక్తివచ్చునట్లు చేయవలయుననుకొనిరి. ఇద్దరూ దీర్ఘంగా ఆలోచించి ఒక యుక్తినిపన్నిరి.

రామయ్య కొంచెం నారను తెచ్చి తండ్రికి చూపించి దీనినేమందురనెను. వెంకయ్య 'నార' అనెను. గోపయ్య ఒక అణాబిళ్ళను తండ్రికి చూపించి దీనినేమందురనెను. వెంకయ్య 'అణా' అనెను. రామయ్య రెంటిని కలిపి చెప్పుమనెను. వెంకయ్య 'నారాయణ' అనెను. కొడుకులు మరలచెప్పమనిరి. వెంకయ్య 'నారాయణ' అని 'అబ్బ ఇంకనన్ను విసిగించకండిరా' అని దానిని అవతల పారవేసెను.

వెంకయ్య మరణించెను. కాని చావుకుముందు దేవుని 'నారాయణ' అని స్మరించుటచే వెంకయ్య ముక్తి పొందెను.

కాబట్టి యుక్తితో ప్రయత్నించి ఎటువంటి కార్యమునైనను సాధించవచ్చును.

## తెలివితేటలు లేకపోతే....

బాలలూ! మీరు బుద్ధిమంతులై యుంటే అన్ని విధాల బాగుపడతారు. అలాకాకుంటే అనేక కష్టాలపాలగుతారు. అదెలాగంటే—

పూర్వము గాన్గుడనే బ్రాహ్మణుడు దుర్గాదేవిని గురించి ఘోరతపస్సు చేశాడట. అతనిభక్తికి ప్రసన్నురాలై "ఏమివరము కావలెనో కోరుకొనుము" అని అడిగిందట.

అప్పుడా బ్రాహ్మణుడు సంభ్రమముతో నమస్కరించి "జగన్మాతా! చనిపోయిన ప్రాణులను బ్రతికించే అవకాశం ప్రసాదించుము" అని ప్రార్థించాడట. దుర్గాదేవి కొంత సేపు ఆలోచించి కొన్నిపచ్చి ఆకులను బ్రాహ్మణునకిచ్చి "వత్సా! యీ ఆకులరసం మృతజీవులపై చల్లినంత మాత్రాన ప్రాణమువస్తుంది. ఈ ఆకులు ఏ నాటికి ఎండిపోవు వీనిని జాగ్రతగామాత్రం ఉపయోగించుకో"మని చెప్పి అంతర్ధానమయింది దుర్గాదేవి.

అప్పుడా బ్రాహ్మణుడు ఆకులు తీసికొని యింటిదారి పట్టాడు. అలా వెళుతూయుండగా త్రోవలోని అడవిలో నొకచోట పులి ఒకటి చచ్చిపడియుంది. దుర్గాదేవి ప్రసాదించిన ఆకుల ప్రభావమును పరీక్షింప దలచి పులిని బ్రతికింపదలచాడు. వెంటనే ఆయాకులరసమును పులిశవ మీద పిండాడు. వెంటనే ఆ పులి పునర్జీవియై బ్రాహ్మణునిపైబడి చంపివేసిందట.

చూచితిరా బాలలూ! తెలివి లేమిచేత దుర్గాదేవి అనుగ్రహాన్ని సద్వినియోగం చేసికొనలేక తనకే ముప్పు తెచ్చుకున్నాడు. తెలివితేటలు, బుద్ధిబలము లేనివారు తమకుగల అవకాశములను సద్వినియోగపర్చ లేరు. మరిమీరో —

కుమారి దొండపాటి లలితాశ్యామలాంబ

# లక్క గేదె

బ్రాహ్మణుడొకడు లేమిచే బాధపడుచు
తనకుటుంబమె పోషించుకొనగ లేక
ధనము గడియింప మనసునందున దలంచి
సముద్రమును దాటి దూరదేశములకేగె.

కొంతకాలము గడచిన యంత నతడు
ధనము నార్జించి తనగ్రామమునకు వచ్చె
పురజనులు వానినత్యంత గారవమున
నతనిదోడ్కొని వచ్చె గృహమునకపుడు.

భర్త రాకకు ముదమంది భార్యయంత
కమ్మనేయియు కూరలు గట్టిపెరుగు,
పిండివంటలు జేసియుప్రీతిగలుగ
దనివి తీరగ పతికిభోజనముపెట్టె.

అతడు నవి యెల్ల కాంక్షతో నారగించి
ఇంతితోడ వచించెను నీవిధమున
నే నిచటనుండి దేశము లేగునపుడు
యేమి లేవయ్యె నింటిలో నెట్లువచ్చె?

ఇన్ని కూరలు భక్ష్యంబు లిట్టినేయి
ఇచట నున్నట్టి వానికి నేమిగాని
యిట్టిపెరుగును జూచి నేనెన్నడేలుగ
నెట్టు లభియించె నీకిట్టి గట్టిపెరుగు?

అనఁగ నవ్వుచు నాసాధ్వి యనియె నిట్లు
"ఇట్టి పెరుగన్న మీకెంతో యిష్టమనుచు
గొంటి నొకగేదె మనపొరుగింట నున్న
కంసలికి నాగొలుసు తాకట్టుపెట్టి."

ఏమి? యెచట కొంటివి మనకెదుట నున్న
యట్టి కంసాలి చెంతనా! అట్టులైన
నిక్కమగు గేదె కాదది లక్కగేదె
నమ్మి కంసాలి మనల మోసమ్ము జేసె.

అనుచు నాతడు నగను ననియె నామె
నీదు పల్కులు చోద్యంబుగాదె నాథ!
లక్కగేదెలుం యుండునే యెక్కడైన
యెవ్వరైనను విన్నచో నవ్వరొక్కొ?

ఎవ్వరెన్ని విధంబుల నవ్వినేమి!
"నిక్కమగు గేదె కాదది లక్కగేదె"
యనుచు ముమ్మారులను వచియించుచుంటి
ననుచు భార్యతో గట్టిగ ననియె నతడు.

"గడ్డిమేయుచునున్నది" గడ్డిమేసి-"పాలనిచ్చుచు
నున్నది" పాలనిచ్చి
"పేడ వేయుచునున్నది" పేడవేసి-"దూడ లీనుచు
నున్నది" దూడలీనె
వారి యిరువుర కీరీతి వాదమేమొ-జరుగ. భార్య
మాట వినక జాలనేపు
నేను పలికినమాటయే నిక్కమనుచు-పెనగులాడె
"ససేమిరా" యంచు భర్త

అంత నిట్లుగ భర్తతో ననియె భార్య-వాదమేటికి?
యది లక్కగేదె యనుచు
మీరు పూర్తిగ మదిని నమ్మితిరయేని - ఋజువు
జేయుడు హేతువేదేని తెల్పి.

"అట్టులైన వచించెద నతివ వినుము-మును నేనీ
పురమ్మున నున్నయపుడు
చెవుల పోగులు చేయింప చిన్నవైన-కొన్ని
బంగారునాణెముల్ గూడబెట్టి

ఎదుట నున్నట్టి బత్తునియింటికేగి కంసలీ నీదు నేర్పెల్ల
గాను పింప
గట్టి కుండలములజత కట్టవలయు-ననుచు బల్కగ
నీరీతి ననియె నతడు.

ఇరుగుపొరుగున నుంటిమి యిన్ని నాళ్లు-లోతి
వాడనె పలుక నీరీతి ననుచు
మంచిమాటల నన్ను నమ్మగ బల్కి శీఘ్రమున కుండ
లమ్ముల జేసి యిచ్చె

తూన్క తూచితి సరిగానె తూన్క తూగె-గీటు
పెట్టితి మేలిమి గీటువచ్చె.
నాణెమరసితి చక్కని నాణెమమరె-మోదమంది
ధరించితి ముదముగల్గ.

కొన్ని రోజులు గడచె నేకొంత లేక-పెద్ద కోమటి
ఇంటిలో పెండ్లియొకటి
జరుగ సంభావనంబున కరిగియుంటి-త్రోపులాడిరి
దొడ్డిలో బాపనయలు.

చెవులు పట్టుక నసులాగె సెట్టికొడుకు ఇంతి
యాతని పోతరమేమి జెప్ప
వెంటనే కుండలంబులు వెళుకుమంచు-లొట్టవడి
యీవలికి వచ్చెలోని లక్క
మాయగా! బత్తుడెంతటి మాయజేసె-మంచిమాటల
నమ్మంగ బల్కి!

లక్క పోగుల జేయగలట్టి వాని
కొక్క లెక్కయె జేయంగ లక్కగేదె
కాన! చెప్పుచునుంటి నో కాంత వినుము
గేదె కాదది లక్కగేదె కాని.

ఆకుల దేవకీదేవి

నొప్పిలో అవస్థనా?

"నోపెయిన్"

వాడిన వెంటనే నిగ్రహించును.

ఒక కలకత్తా కెమికల్ తయారింపు

మద్రాసు ఆఫీసు : 5/149 బ్రాడ్వే, మద్రాసు 1.

# విండర్ మియర్ సతి విసనకర్ర

రచయిత :

ఆస్కార్ వైల్డ్

అనువాదం :

సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

మి.ఎ:—బాధతో కుమిలిపోతున్నట్లుగా కనబడుతుంది. అయినా తమాయించుకుని విండర్ మియర్ సతి కూర్చున్న చోటికి వస్తుంది. మాట్లాడేటప్పుడు చేతులామెవైపు చాచుతుంది. అయినా ఆమెను ముట్టుకోడానికి మాత్రం సాహసించదు. నన్ను గురించి మీరేమి అనుకున్నా సరే, నేను గడ్డిపోచలాంటి దాన్నిని. నాకోసమని మీ మనోహరమైన యావన జీవితాన్ని పాడుచేసుకోకండి! ఈ ప్రదేశాన్ని మీరు తక్షణం విడిచిపెడితేనేగాని మీకు ఏమిసంభవింపనున్నదో మీకు తెలియదు. కాలుజారడమంటే ఏమిటో మీకు తెలీదు. అందరి తిరస్కారానికి, అవమానానికి, పదవి విరుపులికి లోనుకావడం అంటే ఏమిటో, అంటరాని స్త్రీగా ఉండడమంటే ఏమిటో మీకింకా తెలీదు. ఇంటినుండి వెడలగొట్టిన తర్వాత సందుగొందుల్లో తలదాచుకుని లోకానికి తలచూపడానికి జంకి, ఎక్కడికివెడితే ఎవరు గుర్తుపడతారో అనే భయంవల్ల ముడుచుకుపోతూ జీవచ్ఛవంలాగ గడిపేకంటే ప్రాణాన్ని విడిచిపెట్టడం ఎంతో మేలు. దానిబాధ ఏమిటో మీకింకా తెలీదు. చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చెయ్యాలి. ఒకసారికాదు, రెండుసార్లు కాదు, జీవితపర్యంతమూ మీరు అలాటి అగాథంలో పడిపోకండి. యాతనపడడమే చేసిన పాపానికి తగిన ప్రాయశ్చిత్తము అయ్యే పక్షాన్ని నేను ఈ తరుణాన్ని తగిన ప్రాయశ్చిత్తం చేసేనన్నమాట. కరుణ, అంటే ఏమిటో తెలియని ఈ హృదయంలో ఈ నాడు మీరు కరుణని పుట్టించేరు. గడచినదానికి విచారించి ప్రయోజనం లేదు. నాజీవితం సర్వనాశనమైనా మీ జీవితాన్ని మాత్రం నాశనం కానివ్వను. అవును, ఇంత లేతవయస్సులో ఉన్న మీరు అతఃపాతాళంలో పడిపోవడం నేను సహించలేను. కాలు జారినా తిరిగి లాగలిగే సామర్థ్యం మీకు లేదు. మీకు దానికి తగిన సామర్థ్యంగాని, సాహసంగాని లేదు. మీరు అవమానాన్ని ఎదుర్కొన

లేరు. వద్దు, వెళిపోండి. మిమ్మల్ని ఎంతో గాఢంగా ప్రేమిస్తున్నటువంటి, మీరెంతో గాఢంగా ప్రేమిస్తున్నటువంటి మీ భర్త దగ్గిరకి తిరిగి వెళ్లండి. విండర్ మియర్ సతీ, మీకో కుమారుడు ఉన్నాడు. ఈ పాటికి ఆ బిడ్డ ఏదో ఒక కారణంవల్ల, సంతోషంవల్లనైనా సరే, బాధవల్లనైనాసరే మిమ్మల్ని వెదకుతూ ఉండవచ్చు (విండర్ మియర్ సతి లేస్తుంది) భగవంతుడు మీకా బిడ్డని ప్రసాదించేడు. అతని జీవితాన్ని తగుమార్గంలో పెట్టి, అతనిని జాగ్రత్తగా చూస్తూ ఉండవలసినదిగా భగవంతుడు మిమ్మల్ని కోరుతున్నాడు. మీవల్ల మీబిడ్డ జీవితం పాడయ్యిందంటే భగవంతుని ఆగ్రహానికి పాత్రులౌతారుసుమా? విండర్ మియర్ సతీ, పదండి, పదండి. మీ భర్తగారు మిమ్మల్ని ఎంతో ఇదిగా ప్రేమిస్తున్నారు! ఆయనెప్పుడూ పెడదారిని వెళ్లలేదు. ఒకవేళ ఆయన రకరకాలైన ఇతర స్త్రీలతో తిరుగుతున్నా, మీరు మీ కుమారునితో ఉండడం న్యాయం. ఆయన మీపై ఎంత కసురుకున్నా మీరు మీ బిడ్డతోనే ఉండాలి. ఆయన మిమ్మల్ని ఎంత అవమానపరచినా మీరు మీబిడ్డతోనే ఉండాలి. ఒకవేళ ఆయన మిమ్మల్ని విడిచిపెట్టేసినా మీరు మాత్రము మీ బిడ్డని ఎంతమాత్రమూ విడవకూడదు. విండర్ మియర్ సతి వెక్కి వెక్కి ఏడుస్తుంది తన ముఖాన్ని చేతులతో కప్పుకుని (గబగబా ఆమెవైపుకు వెళ్లి) విండర్ మియర్ సతీ! విండర్ మియర్ సతి (చంటిపిల్లలాగ తన రెండు చేతుల్నీ జాలిగా ఆమెవైపు చాచుతూ) నన్నింటికి తీసుకుపోవూ? నన్నింటికి తీసుకుపోవూ!

మి.ఎ:-(ఆమెను కౌగిలించుకోబోతుంది. అయినా తమాయించుకుంటుంది. ఆమె ముఖంలో అపూర్వమైన ఆనందం తాండవిస్తుంది) రండి! మీ పొడుగుకోటేదీ? (సోఫామీద నున్న దానిని అందుకుని) ఇదిగో తొడుగుకోండి. త్వరగారండి!

[ఇద్దరూ తలుపువైపు వెడతారు]

విం.స:-ఆగు! ఏవో గొంతుకలు వినబడుతున్నాయి.

మి.ఎ:-లేదు, లేదు. ఎవరూలేరు!

విం.స:-అవును. అదుగో విను! అయ్యో అది ఆయన గొంతుకే! ఆయన లోపలికి వస్తున్నారు! నన్ను రక్షించు! అయ్యో, ఇదేదో పన్నాగంలాగున్నది! నువ్వే ఆయనికి కబురంపించేవు. బయట గొంతుకలు వినబడతాయి.

(సశేషము)



# అభ్యుదయ నర్తకి కుమారి అమృతవల్లి

కళాపిపాస, కళారాధన కొందరిలో పుట్టుకతోనే ద్యోతమగుతుంటవి. దాని కనుకూలమైన వాతావరణము, అవకాశములు సమకూరుటతో వారు ఉత్తమ కళారాధకులుగాను, కళాకారులుగాను రూపొందుతుంటారు.

గత జూలై నెల 18వ తేదిన అన్నామలై మన్రములో పురప్రముఖులనేకుల ఎదుట జరిగిన కుమారి అమృతవల్లి నృత్యప్రదర్శనమునకు మద్రాసు విశ్వవిద్యాలయపు సంగీత శాఖాధ్యక్షులు ప్రొఫెసర్ పి. సాంబమూర్తి గారు అధ్యక్షత వహించి "కుమారి అమృతవల్లికి ప్రజ్ఞావిశేషములు, నృత్యమునకనువైన దేహసౌష్టవము పుట్టుకతోనే అబ్బినవనిపించుచున్నది" అని, ఆమె పదనైపుణ్, భావాభినయ భంగిమా చమత్కృతిని విశేషముగా ప్రశంసించారు. ఈమె నాట్యాచార్యులు శ్రీ పి. జి. చెల్లప్పగారివద్ద శిక్షణ పొందింది 18 నెలలకాలమే అయినా ఆమె ప్రావీణ్యత, భంగిమములలోని వంపుసొంపులు ప్రేక్షకులను విశేషముగ నానందపరవశులను చేసినవి. కొద్దికాలంలోనే యింత ఉత్తమస్థాయి నందుకో కలిగిన కుమారి అనతికాలములోనే ప్రథమశ్రేణికి చెందిన నర్తకి కాగలదని మా నమ్మకము.

ఆనాటి కార్యక్రమంలో ముఖ్యముగ కాంభోజి రాగంలో పాడినవర్ణం, కన్నడ రాగంలో పాడినతిల్లానా ప్రేక్షకులను తన్మయులుగా జేసినవి.

ఈమె వయసు 12 సంవత్సరములు. సేవాసదనం హైస్కూలులో IV ఫారం చదువుచున్నది. తండ్రి శ్రీ ఎ. వెంకటాచార్యులుగారు మద్రాసు క్రిస్టియన్ కాలేజి హైస్కూలు అసిస్టెంటు హెడ్మాష్టరు. వీరు ఆంధ్రులు – చిత్తూరు జిల్లా వాస్తవ్యులు. కళాపోషకుల ఆదరాభిమానములతో కుమారికి చక్కని భవిష్యత్తు నిర్మాణమగుగాక!

బి. ఎ. సుబ్బారావు ప్రొడక్షన్స్‌వారు 'సత్యభామ' చిత్రాన్ని అంజలిదేవి, నాగేశ్వరరావు, శ్రీరంజని, రేలంగి గార్లతో నిర్మించనున్నారు. నిర్మాత, దర్శకుడు శ్రీ బి. ఎ. సుబ్బారావు.

♦ ♦ ♦

జనతా పిక్చర్స్‌వారి 'పరివర్తన' యించుమించుగా పూర్తయినట్లే. ఆగస్టు 15వ తేదీన విడుదల కావచ్చునని తలంచుచున్నారు.

♦ ♦ ♦

యునైటెడ్ టెక్నీషియన్స్ & శ్యామలావారి 'పల్లెపడుచు' యీ నెలలోనే విడుదల కావచ్చును.

♦ ♦ ♦

విజయావారి రానున్న చిత్రము 'శశిరేఖాపరిణయము' దర్శకత్వము శ్రీ కె. వి. రెడ్డి, నిర్మాతలు నాగిరెడ్డి, & చక్రపాణిగారలు.

భరణీవారి 'విప్రనారాయణ' చిత్రంలో వి. నాగేశ్వరరావు, రేలంగి, శ్రీమతి భానుమతి మొదలగువారు నటిస్తున్నారు. శ్రీ రామకృష్ణ దర్శకుడు. అక్టోబరులో విడుదల చెయ్యడానికి వీలుగా చిత్రం షూటింగ్ చురుకుగా సాగుతున్నది.

♦ ♦ ♦

పక్షిరాజావారి 'అగ్గిరాముడు' చిత్రం యీ నెల 5వ తేదీన విడుదలయింది. భానుమతి కడుసమర్థంగా నటించినది.

'సావిత్రి' చిత్రాన్ని సయితం తయారు చెయ్యడానికి పక్షిరాజావారు పూనుకున్నారు. ఇందులో జి. వరలక్ష్మి, యన్. టి. రామారావు, యస్. వి. రంగారావుగారలు నటిస్తున్నారు.

♦ ♦ ♦

విజయావారి 'మిస్సమ్మ' చిత్రం షూటింగు జరుగుతూంది.




**మరణసుంకాలచట్టం : శ్రీ పి. సి. రెడ్డి ; ప్రభాత పబ్లికేషన్స్, గూడూరు, నెల్లూరుజిల్లా వెల 0-4-0**

ప్రభుత్వ చట్టాలను సామాన్య ప్రజానీకానికి అర్థమయ్యేలాగున చిన్న చిన్న పుస్తకాల రూపంగా ప్రచురించడం ఎంతైనా హర్షించతగిన విషయము. అందులో యీ 'మరణ సుంకాలచట్టము' ఒకటి. ప్రజా సామాన్యపు ఆర్థిక వ్యవస్థపై యీ చట్టముయొక్క ప్రభావము, దాని వివరములు యీ చిన్న పుస్తకంలో సరళమైనశైలిలో పొందుబరచబడియున్నవి.

**గాంధీశతకము : శ్రీ బులురెడ్డి సుబ్రహ్మణ్యం, సాహితీ విలాసము, తిరుపతి. వెల 0-4-0**

ఇందలి కందపద్యములలో గాంధీజీ జీవిత విశేషాలను, బోధనలను గ్రంధకర్త సరళమైన భాషలో మనోహరంగా పొందుపరచాడు.

పుణ్యపురుషులు రాముడు, కృష్ణుడులాంటి వారి జీవిత విశేషాలను కీర్తించుటకు సమకట్టినట్లే పూజ్య బాపూజీ జీవిత విశేషాలను సయితం కీర్తించారు. విద్యార్థులకు ముఖ్యంగా పఠ్యయోగ్యమైనదీగ్రంథము. ఇది రెండవ ముద్రణ.

**నాగొడవ : శ్రీ కాళోజి నారాయణరావు : దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాద్. వెల రు 1-8-0**

ఇది ఖండకావ్యాల సంపుటి. ఇందలి కావ్యాలు 'మాతృదేశము' తో ప్రారంభమయి పునరా స్మృతి'తో ముగింపుకు వచ్చినది. ఇందలి 57 కావ్యాలు కొన్ని ప్రబోధనాత్మకంగాను, సాంఘిక వ్యవస్థను చిత్రించునవిగాను, మరికొన్ని విజ్ఞానాన్ని, ఆనంద తన్మయత్వాలను ప్రోత్సహించేవిగానున్నవి.

మృదు మధుర భావ, శైలిలో నడిచిన యీ ఖండ కావ్యాలు విశేషంగా ప్రచారంలోకి రాగలవనే మా నమ్మకము.

**మేఖసందేశము : అనువాదకుడు శ్రీ కె. నారాయణరావు బి. ఎ. బి. యల్. ప్రచురణకర్తలు : జయలక్ష్మీ & కంపెని, నెల్లూరు.**

కాళిదాసు మహాకవి సంస్కృత విరచితమయిన మేఖసందేశమునకు యింతవరకు వెలువడిన ఆంధ్రానువాదాలు పద్యరూపంలోనివి. ఇప్పుడిది గద్యానువాదం. మేఖసందేశము గద్యలో ననువదించడం సాహస కృత్యమనే చెప్పాలి.

ఇందులో గ్రంధకర్త మూలశ్లోక భావాలను పోషించడానికి మూలంలోని సంస్కృతపదాలను వాడినా వీరి రచనాశైలి అనర్గళంగాను, పాఠకులలో ఆసక్తి, ఉత్సాహాలను ప్రేరేపించునదియై యొప్పుచున్నది.

# సంపాదకీయములు

## జాతీయ పురోభివృద్ధిని సూచించేది ఆగష్టునెల

ఈ రోజున మన యావద్భారత జాతి స్వాతంత్ర్య దినోత్సవము జరుపుకుంటున్నది. గడచిన 7 సంవత్సరాలనుండి స్వేచ్ఛావాతావరణంలో స్వతంత్రజాతిగా పురోభివృద్ధిని తీర్చిదిద్దుకోడానికి అవకాశాలు, వాతావరణము అమరినవి. ఏటేటా యీ ఉత్సవాలు జరుపుకొనే సందర్భమున గతంలోని భారతజాతీయ సమరాన్ని, అది సాధించిన ఘనవిజయాలను, వీరోచితంగా పోరాడి అఖండత్యాగాలు చేసిన జాతీయ వీరులను, వారి ఆదర్శలక్ష్యాలను స్మరించడం, వారి నారాధించడం, అనుసరించడం తరతరాలకు ధర్మమనిపించుకుంటుంది.

ప్రజాయుద్యమాలు ఎల్లప్పుడూ ఏదో రూపంగా నుంటునేయుంటవి. కాని అవి ఎల్లప్పుడు తమ అభ్యుదయ పురోగమనానికి తోడ్పడకలుగునట్టివై ప్రజలలో సమరససద్భావాలు, సమైక్యత, శాంతి సౌభాగ్యాలు వర్ధిల్లుట కనువైనవిగా రూపొందాలి. దానికి జాతీయనాయకుల ఆదర్శ లక్ష్యాలు, బోధనలు ప్రజలకు మార్గదర్శకం కావాలి!

## కాలేజి హైస్కూళ్ల జీతాల తగ్గింపు

ఇతర దేశాలతో పోల్చిచూస్తే మనదేశంలో చదువుకున్నవారి సంఖ్య బహుకొద్ది. కాబట్టి దేశం మొత్తముమీద విద్యా సౌకర్యాలు విస్తృతం కావలసిన అవసరం ఎంతైనాయున్నది. దాంతోబాటు మన దేశంలోని ఆర్థికదుస్థితి సామాన్య ప్రజానీకంలో విద్యావిజ్ఞానముల వ్యాప్తికి అవరోధంగానున్నది. ఈ పరిస్థితులలో మన ప్రభుత్వము విద్యాసౌకర్యాలను జాతీయంచేసి బీద, సాద అనే విచక్షణలేకుండా ప్రతియొక్కరి అందుబాటులోనికి తీసికొని రావడం ముఖ్యావసరము. అది తక్షణమే సాధ్యముకాని పరిస్థితులలో ప్రభుత్వసహాయముతో తక్కువ వ్యయంతోనయినా విద్యా సౌకర్యాలు అందుబాటులోకిరావాలి. అంటే కాలేజి హైస్కూళ్లలో జీతాల తగ్గింపుకై జరిగే ఆందోళనను ప్రభుత్వము సానుభూతితో గుర్తించగలదని మానమ్మకం.

## గ్రామాలలో అదనంగా పంతుళ్ల నియామకం

విద్యావంతులలో నిరుద్యోగాన్ని తగ్గించడాని కుద్దేశించబడిన ప్రణాళికక్రింద రాష్ట్రప్రభుత్వాలచే అదనంగా 17640 మంది ఉపాధ్యాయుల నియామకాన్ని ఇండియా ప్రభుత్వము మంజూరుచేసింది.

ఈ ప్రణాళిక విద్యావంతులలో నిరుద్యోగాన్ని తగ్గించడంతోబాటు గ్రామీణప్రాంత్యాలలో విద్యాసౌకర్యాలు అభివృద్ధి చెంది ప్రజలలో అభ్యుదయ పురోభివృద్ధులను ప్రోత్సహించగలదు. అంతేకాక విద్యావంతులకు గ్రామీణ జీవితంలోని కష్టసుఖాలు, పరిస్థితులను తెలిసికోడానికి, తమ విద్యా విజ్ఞాన, సంస్కృతులను గ్రామీణ ప్రజల అభ్యుదయానికి వినియోగించిటకు అవకాశము లేర్పడనుండుట సంతోషింపతగినది. ఈ విధంగానైనా గాంధీజీ విద్యావంతులను గ్రామాలకు పోయి సేవచేయవలసినదిగా చేయుచుండిన ప్రబోధం సఫలీకృతం కానుండుట హర్షనీయము.

—(౦)—

## శ్రీ జయనామ సం॥ర శ్రావణ-భాద్రపదమాసములు

1954 సం॥ ఆగస్టు నెల

| | | |
|---|---|---|
| 16 | సో | విదియ 20-5 శత 5-40 ది 21-2 |
| 17 | మం | త 15-25 పూభా 3-9 ది 25-51 |
| 18 | బు | చ 9-55 రే 55-45 ది 27-46 |
| 19 | గు | పం 3-47 ఏప్యం 53-3 రా 10-42 |
| 20 | శు | స 50 38 భా 46-31 దివి 13-14 |
| 21 | శ | అ 44-13 కృ 42-5 ది 19-13 స్మార్త శ్రీకృష్ణజయంతి |
| 22 | ఆ | ష 38-13 రో 38-1 రా 20-8 వైష్ణవ శ్రీకృష్ణజయంతి |
| 23 | సో | ద 32-55 మృ 34-40 రా 23-45 అమృతయోగం |
| 24 | మం | ఏ 28-31 ఆర్ద్రా 32-12 త్యాజ్యాభావః |
| 25 | బు | ద్వా 25-9 పున 30-47 దివి 1-24 |
| 26 | గు | త్ర 22-58 పుష్యమి 50-33 త్యాజ్యాభావః |
| 27 | శు | చతు 22-1 ఆశ్రే 31-31 దివి 3-0 త్యా 4-4 చతుర్ధశితిధిః |
| 28 | శ | ● అమా 22-19 మ 33-42 ది 2-31 రా 23-55 |

### భా ద్ర ప ద మా స ం

1954 సం॥ సెప్టెంబరు నెల

| | | |
|---|---|---|
| 29 | ఆ | శుద్ధపాడ్యమి 23-47 పూ.ఫ 37-1 రా 25-47 |
| 30 | సో | విదియ 26-18 ఉఫ 41-19 కల్కిజయంతి |
| 31 | మం | తదియ 29-42 హ 46-24 ది 4-0 సామవేదినాముపాకర్మ |
| 1 | బు | చ 33-45 చి 52-5 ది 8-11 త్యా 4-23 సిద్ధివినాయకవ్రతం |
| 2 | గు | పం 38-11 స్వా 58-4 ది 7-21 |
| 3 | శు | ష 42-18 విశా 60-10 ది 13-22 బుద్ధజయంతి |
| 4 | శ | స 47-10 వి 4-1 ది 15-0 అముక్తాభరణసప్తమి |
| 5 | ఆ | అ 51-11 అనూ 9-46 దివి 25-1 అమృతయోగం |
| 6 | సో | న 54-29 జ్యే 15-0 రా 5-53 త్యా 4-18 |
| 7 | మం | ద 56-33 మూ 19-25 దివి 15-7 రా 14-17 |
| 8 | బు | ఏ 58-12 పూషా 22-55 రా 13-12 స్మార్తైకాదశి |
| 9 | గు | ద్వా 58-17 ఉషా 25-18 రా 5-0 వైష్ణవేకాదశి వామనజయంతి |
| 10 | శు | త్ర 57-5 శ్ర 26-30 రా 6-1 అమృతయోగం |
| 11 | శ | చతు 54-38 ధని 26-27 రా 13-39 అనంతపద్మనాభవ్రతం |
| 12 | ఆ | ○ 51-0 శత 25-13 భ 22-44 |
| 13 | సో | బ.పాడ్యమి 46-20 పూభా 22-54 మహాళయపక్షారంభం |
| 14 | మం | విదియ 40-50 ఉ.భా 19-40 రా 17-25 |
| 15 | బు | తదియ 34-44 రే 15-44 త్యాజ్యాభావః |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

